శ్రీ సర్వజ్ఞ సింగ భూపాలవిరచిత

# రత్నపాంచాలిక

(అను నామాంతరముగల)

# కువలయావళీ నాటిక

డాక్టర్ గిడుగు వేంకట సీతాపతి, బి.ఏ. ఎల్.టి. డి. లిట్. గారి

ఆంధ్రానువాదముతో

శ్రీ సర్వజ్ఞ సింగ భూపాలవిరచిత

# రత్నపాంచాలిక

Ratna panchalika

(అను నామాంతరముగల)

# కువలయావళీ నాటిక

Kuvalayavaleenatika.

Venkata Seethapathi

G

డాక్టర్ గిడుగు వేంకట సీతాపతి, బి.ఏ. ఎల్.టి. డి. లిట్. గారి

ఆంధ్రానువాదముతో

శ్రీ పిఠాపురము మహారాజా సాహిత్య చక్రవర్తి

శ్రీ రావు వేంకట కుమార మహీపతి సూర్యారావు బహదరు

వారి సమాదరణమున ప్రకటితము



1946

వెల 1-4-0.

# మనవి

శ్రీ సర్వజ్ఞసింగభూపాలుఁడు సంస్కృతభాషలో రచించిన కువలయావళి యను నాటికకిది నా యాంధ్రానువాదము. శ్రీ పీఠికాపుర మహారాజును సాహిత్యచక్రవర్తియు నగు శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారాయ బహద్దరువారికి నాయెడలఁగల దయచేతను, ఆదరాభిమానములచేతను నే నీ నాటిక ననువదించుట జరిగినది.

ఈ యనువాదము మూలముతో సైతము ప్రకటించిన శ్రీవారికి దీనిని కృతజ్ఞతతో సమర్పించి కృతకృత్యుఁడనైతినని సంతసించుచున్నాను.

ఈ నాటిక ప్రదర్శించుటకు యోగ్యమగుటచేత, నేఁటి ప్రేక్షకుల యభిరుచి ననుసరించి, నటీనటుల కోరికలను పాటించి కొన్ని సన్నివేశములందు—మూలమున లేకపోయినను సందర్భోచితముగాఁ గొన్ని పాటలు రచించి యీ గ్రంథమున కనుబంధముగాఁ బ్రకటించితిని.

చెన్నపురి.
1—1—1946.

సీతాపతి.
(ఆంధ్రానువాదకుఁడు)

# సర్వజ్ఞ సింగభూపాల ప్రశంస

ప్రాజ్ఞులు, సాహితీనిధులు, వైదిక లౌకిక విద్యలందు మహా
ప్రజ్ఞగలట్టి ధీమతులు, పండితులున్, గవిచంద్రులున్, గళా।
భిజ్ఞులు, గానకోవిదులు ప్రీతిచెలంగ నుతించినట్టి స
ర్వజ్ఞుఁడవీవు సింగజనపాలక! శాశ్వతకీర్తి చంద్రికా!॥

నవరసభరితమై నవకల్పనాఢ్యమై
తనరారు నీ కవిత్వప్రశస్తి।
రసికాగ్రగణ్య! నీరత్నపాంచాలికా
నాటికారత్నమే చాటుచుండ।
గీర్వాణసాహితిన్ సర్వతోముఖమైన
నీ మహాప్రౌఢ పాండిత్యగరిమ।
భవదీయమగు రసార్ణవసుధాకరమను
కావ్యలక్షణమె లక్ష్యముగఁ దెలుప।
నీదుసంగీతశాస్త్ర పాండిత్యపటిమ
తావకీన సంగీతసుధాకరంబె।
వివిధదేశాల వ్యాప్తిగావించుచుండ
నిన్ను సర్వజ్ఞుఁడని యెన్నకున్నె జగము?॥

ధన్యుఁడవు సింగభూపాల! మాన్యచరిత!
నయవినయదయాదానసౌందర్యగరిమ।
వాక్చతురతయు శౌర్యసంపదయు మొదలు
గాఁగలట్టి నీ సద్గుణగణము నెంచి।
లక్షణంబులకుఁ దగిన లక్ష్యములుగ
నుండు శ్లోకాల నీ కీర్తి నుగ్గడించి।
తన చమత్కార చంద్రిక యనెడుకావ్య
మందు విశ్వేశ్వరకవి హృద్యముగఁ బలికె॥

గర్జితఘూర్జరగర్వపర్వతభేది
నేపాలనృపతమోనిచయసవిత।
త్రుళ్లుకేరళమాళిఁ ద్రొక్కియాండునటుండు
కటురటత్ సౌరాష్ట్రపటువిరోధి।
భువనాభయవ్రతుం డవని పాలనదక్షుఁ
డఖిలప్రజానురాగాన్వితుండు।
పరిపంథిమదమత్తకరికుంభవిదళన
శితనఖసింహ మీ సింగనృపతి।
యనుచు నీరీతి నీ ప్రతాపాతిశయము
శ్రితజనావనదీక్ష సుస్థితి దిదృక్ష।
నభినుతింతు రా విశ్వేశ్వరాది కవులు
సింగభూపాల! విక్రమశ్రీవిశాల!॥

రావువంశాబ్ధిసోమ! సర్వజ్ఞనామ!
త్వత్కులోద్దీపకుండు సత్కార్యరతుఁడు।
ప్రభువు పీఠికాపురమహారాజునైన
వేంకటకుమార మహీపతి విలసితమతి।
సూర్యరాయాభిధానుఁ డౌదార్యఘనుఁడు
చారుతరకీర్తి సాహిత్యచక్రవర్తి।
వేల్పుబాసను నీవుగావించినట్టి
కువలయావళీ నాటికను వెలయింప।
నెంచి దయఁజూపి నేను గావించినట్టి
యాంధ్రభాషానువాదంబు నమరఁజేర్చి।
యచ్చుగావించి యాంధ్రులకందఁజేయఁ
జదివి యానందమంది నీ చతురరచన।
నరయుసద్భాగ్యమాంధ్రుల కబ్బెనిపుడు;
ఆంధ్రదేశాన నీకీర్తి వ్యాప్తిచెందు।
మీ యనుగ్రహాదరము నామీఁద వెలయ
నేను ధన్యుండనైతినో నృపవరేణ్య!॥

సీతాపతి.

# తొలిపలుకు

సర్వజ్ఞసింగమహీపాలమౌళి పద్మనాయకకులప్రదీపకుఁడు; రావువంశరత్నాకరసుధాకరుఁడు. ఈ యసాధారణధీనిధి దిగంతవిశ్రాంతకీర్తిని గాంచెను. సర్వజ్ఞబిరుదాంకితుఁడై యసామాన్యప్రజ్ఞాశాలియై ప్రకాశించెను. ఉద్దండపండితాఖండలుఁడు. అలంకారతత్త్వవేత్త. అపారపాండితీపటిష్ఠుఁడు. అలంకారశాస్త్రము నామూలాగ్రముగ నెఱింగి యది చదువరులకు సువ్యక్తమగురీతి రచింప నేర్చిననేర్పరి. రసగ్రహణపారీణుఁడై రసపోషణము విశేషశేముషీవిభవవిజృంభణముతో నొనర్చిన ధీనిధి. 'రసార్ణవసుధాకర' మనునలంకారగ్రంథమును, 'సంగీతసుధాకర' మనుసంగీతరత్నాకరవ్యాఖ్యానమును, 'కువలయావలి' (రత్నపాంచాలిక) యనునాటికారత్నమును రచించి మించెను. సర్వజ్ఞసింగమహీపతి సుమనోమనోజ్ఞమైనకవితాప్రజ్ఞ కలిగి వెలిఁగెను. సంస్కృతనాటకకవిశిఖామణు లైన కాళిదాస శూద్రక భవభూతులకుఁ దీసిపోవువాఁడు కాఁడు.

పండితప్రవరుఁడును, మహాకవియు నైన శ్రీనాథకవిసార్వభౌముఁ డనేకదేశములు దర్శించి బహుళభంగుల గౌరవము లందినదిట్ట. చిరకాలమునుండి శ్రీనాథకవికృతము లని ప్రసిద్ధిఁ జెందినయీ క్రిందిపద్యములవలన శ్రీనాథకవీంద్రునికే కాక లోకమునకుఁ గూడ సర్వజ్ఞసింగజనపాలమౌళియందుఁ గల గౌరవగరిమ విశద మగుచున్నది.

సీ. దీనారటంకాలఁ దీర్థమాడించితి
దక్షిణాధీశుముత్యాలశాల
పలుకుతోఁడై తాంధ్రభాషామహాకావ్య
నైషధగ్రంథసందర్భమునకుఁ
బగులఁగొట్టించి తుద్భటవివాదప్రౌఢి
గౌడడిండిమభట్టుకంచుఢక్క
చంద్రశేఖరుక్రియాశక్తి రాయలయొద్దఁ
బాదుకొల్పితి సార్వభౌమబిరుద

గీ. మెటుల మెప్పించెదో నను నింకమీఁద
రావుసింగమహీపాలు ధీవిశాలు
నిండుకొలువున నెలకొనియుండి నీవు
సరససద్గుణనికురుంబ! శారదాంబ!

క. సర్వజ్ఞనామధేయము
శర్వునకే రావుసింగజనపాలునకే
యుర్విం జెల్లును నితరుని
సర్వజ్ఞుం డనుట కుక్క సామజ మనుటే.

ఈ సర్వజ్ఞ సింగనృపాగ్రణిప్రజ్ఞావిభవ మత్యద్భుతమై శోభిల్లును. ఈ కోవిదుని పాండితీప్రకర్షము పరమోత్కృష్టమైనదై ప్రకాశించుచున్నది. ఈ కవివరేణ్యునకు వ్యాకరణము కరతలామలకము. అలంకారశాస్త్రమును గూలంకషముగ నెఱిఁగినమనీషి; నాటకశాస్త్రవేత్త; సంగీత కళాపారంగతుఁడు. ఈతనికవిత యసమానలసమానవిలాసమున వెలయు; శబ్దార్థాలంకారసంభరితము. మృదుమధురములైనపదముల పొందిక చంద మందమైనది. "లలితకవితావిలాసచతురానన" యనునది

నిజమైనదియు. రచన రసవత్తరము. రసము పొంగి పొరలుచుండును. ఈ విశేషవిషయము లీ మహనీయుని రచన లగు 'రసార్ణవసుధాకరము' 'రత్నపాంచాలిక' మొదలగు గ్రంథములయందు సువిదితములు. 'రసార్ణవసుధాకర' మత్యుత్తమ మైన యలంకారశాస్త్రగ్రంథము. చిరకాలమునుండి వ్యాఖ్యాతృశిఖామణి యని యఖండఖ్యాతి వహించిన కోలాచలమల్లినాథసూరి సర్వజ్ఞసింగజనవరేణ్యునిఁ బ్రామాణికాగ్రగణ్యునిగ గ్రహించి గౌరవించి "రసార్ణవసుధాకరము"లోని శ్లోకములఁ బ్రమాణములుగాఁ దన వ్యాఖ్యానములలో లిఖించెను.

వర్తమానశతాబ్దమున గొప్పపండితు లైన కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రిగారు "రసార్ణవసుధాకర మత్యుత్తమ మైనయలంకారశాస్త్రము. మహావిద్వాంసులు చదువు కొలఁది యలంకారగ్రంథములలో నొకటి" అని సెలవిచ్చిరి.

దీనిశైలి సులలిత మైనది. మృదుమధురపదగుంఫితము. విషయము విస్ఫుటముగ వ్రాయఁబడినది. ఇందలి లక్ష్యములు స్వభావసిద్ధములై యత్యంతోచితము లైన వర్ణనములతో నొప్పి మహామనోహరముగ నున్నవి. "కువలయావళి" యను నాటికకు నామాంతరము "రత్నపాంచాలిక." ఇందలికథ కేవలము స్వకపోలకల్పితము. ఈకావ్యమునందలి కల్పన లనల్పములై ప్రకాశించుచున్నవి. శైలి యకలంకమై ధారాశుద్ధి కలిగి వెలుఁగొందుచుండును. కవిత సముచితచమత్కృతి సమంచితము. ఈ కవిపుంగవునిభావనాశక్తి స్తుతిపాత్రము. స్వభావసిద్ధములైన వర్ణనలతో విలసిల్లుచుండును. మానవస్వభావము నీ కవివరేణ్యుఁడు బాగుగ గుర్తెఱిఁగినవాఁడు. రసపోషణము విశేషచతురతతోఁ జేసెను. పాత్రౌచిత్య ముచిత

రీతిఁ బాటించె. సంభాషణము సమయోచితము. వే యేల? ఈకావ్యము ప్రపంచమునందలి మనుష్యప్రకృతికిఁ బ్రతిబింబమై ప్రకాశించుచున్నది. చదువరులయొక్కయుఁ జూపఱుల యొక్కయు నుల్లముల నీకవితల్లజుఁడు రంజిల్లఁజేయును. ఇట్టి సుగుణమణిగణముతో విలసిల్లు రత్నపాంచాలికా నాటికారత్న ముత్తమోత్తమకావ్య మనుటకు సందియము లేదు.

'సంగీతసుధాకరము' — ఈయది శార్ఙ్గదేవవిరచిత మైన సంగీతరత్నాకరమునకు సర్వజ్ఞశేఖరులు విరచించిన మిగులఘన మైనవ్యాఖ్యానము. మూలమునకు వ్రాసినవ్యాఖ్యానములలో మన కింతవఱకు దొరకినవానిలో 'సుధాకరమే' సుప్రశస్త మైన దఁట. ఈవ్యాఖ్యానములోనివిషయవివరణముఁ జూడ నీగ్రంథ కర్తకు వేదవాక్యములు ముఖస్థము లైనటుల విశద మగుచున్నది. ఈసుప్రసిద్ధగ్రంథముయొక్క వ్రాఁతప్రతులు బరోడా, బికనీరు సంస్థానములందు లభించె ననియు కాశ్మీరసంస్థానమునందుఁగూడ నొకప్రతి యున్నదనియు దెలియవచ్చినది. 'రత్నపాంచాలిక' 'రసార్ణవసుధాకరము' అనుగ్రంథములు తిరువాంకూరుసంస్థాన మున దొరకినసంగతి మన మెఱుఁగుదుముగదా. దీనివలన మనము తెలిసికొనవలసిన దేమన, సర్వజ్ఞశిఖామణిఖ్యాతి చాల కాలముక్రిందనే యాసేతుహిమాచలము వ్యాపించి యున్న దనువిషయము. ఆహా! యీ సాహితీసార్వభౌముని యప్రతి మానపాండిత్యప్రభాప్రభావము!

ఈసరణిని సర్వతోముఖవైదుష్యము గలిగి యప్రతిమాన ప్రతిభాభాసురుఁడై యసాధారణధారాశుద్ధితో శోభిల్లుశైలి గలిగి యలంకారశాస్త్రములలో శ్రేష్ఠముగ నెన్నఁబడుకృతికిఁ

గర్తమై తదనుగుణముగ రసవంతమైన కవితాచాతుర్యముఁ జూపినవిద్వత్ప్రభువు "కువలయావళి"యను చిన్నరూపకమును మాత్రము రచించివేఱుకావ్యములు వ్రాయ కూరకుండునా? రసవత్తరము లగుసత్కావ్యము లనేకము లుదంచద్రీతి రచించి మించె ననియే నానమ్మకము. మొన్నమొన్నటివఱకు వెలు నడక యుండిన 'కువలయావళి' వలెనే యితరకావ్యములు కూడ నెందేని మూలఁబడి యుండవచ్చును. అవి మనకు లభించు భాగ్యము భగవంతుఁడెపుడు ప్రసాదించునో?

విశ్వేశ్వరవిద్వద్వతంసునిచే రచింపఁబడిన 'చమత్కార చంద్రిక' యను నలంకారశాస్త్రమున సింగభూజానిగుణరత్నము లిట్లు వర్ణింపఁబడియె.

దాన దయా నయ వినయములు:

"దానేన కర్ణో దయయా దిలీపో
నయేన కావ్యో వినయేన రామః
యది ప్రసిద్ధిం దధతా మమీభిః
శ్రీసింగభూపో నిఖిలైః ప్రసిద్ధః."

"దానముచేఁ గర్ణుఁడు, దయచే దిలీపుఁడు, నీతిచే శుక్రుఁడు, వినయముచే శ్రీరాముఁడు, కీర్తినిదాల్చినవారు - ఔఁగాక! ఈ యన్నింటిచేతను శ్రీ సింగభూపతి ప్రసిద్ధుఁడు.

సౌందర్యగరిమ:

"అవ్యాజసుందర మనిందితసత్త్వసార
మాజానుబాహు మరవిందదళాయతాక్షమ్
శ్రీసింగభూప మవలోకయతాం జనానా
మానందితాని నయనాని సుధాంబునేవ."

«సహజమైన సౌందర్యముకలవాఁడు, నిందింపఁబడని బలము నిగ్గు కలవాఁడు, ఆజానుబాహుఁడు, తామరపూరేకులవంటి పెద్ద కన్నులు గలవాఁడు నగు శ్రీ సింగభూపాలుని సందర్శించు జనుల నయనము లమృతరసముచేవలె నానందపెట్టఁబడును.»

వాగ్వైదగ్ధ్యము:

«సౌగంధికే చ ఘనసారిణి చందనే చ
బింబాధరే చ సుదృశాం వదనే చ తాసాం
శ్రీసింగభూపరచితే చ గిరాం కదంబే
కో వా న నందతి జనో జగదేకసారే.»

«సౌగంధికపుష్పమందును, కర్పూరమందును, చందనము నందును, సుదృశల బింబాధరములందును, వారలమోము లందును, శ్రీ సింగభూపాల రచితములై జగదేకసారము లగు వాక్యముల కదంబమునందును, ఏ జనుఁడు ఆనందమును పొందఁడు?»

శౌర్యసంపద:

«గర్జద్ఘూర్జరగర్వపర్వతభిదే నేపాలభూపాలక
ధ్వాంతధ్వాంతవిరోధినే కటురటత్సౌరాష్ట్రరాష్ట్రద్రుహే
దృప్యత్కేరళమౌళిమోటనకృతే శ్రీసింగపృథ్వీపతే
భూయాసుర్భువనాభయవ్రతభృతే శ్రేయాంసి భూయాంసి
[తే.»

«గర్జించుఘూర్జరుల గర్వము లను పర్వతములను భేదించువాఁడవును, నేపాళరాజు లను చీకట్లకు సూర్యుఁడవును, కటువుగా సందడించు కేరళుల తలలపై మొట్టువాఁడవును, లోకములకు

వభయ మిచ్చుదీక్ష పూనినవాఁడవును నగు నీకు బహు శ్రేయస్సులు కల్గుఁ గాక!

కొందఱు కిట్టనివా రిట్టివిద్వద్వంద్యుఁ డగుసింగభూమీశునిపై దోషారోపణముఁ జేసిరి. "బమ్మెరపోతనామాత్యకృతమైనభాగవతము సింగభూపతి తన కంకిత మీయఁ గోరెను. దానికిఁ బోతన సమ్మతింపలేదు. అందుపై నాప్రభువు కోపోద్దీపితుఁడై యాగ్రంథమును బాఁతి పెట్టించెను. అందువలనఁ గొన్నిభాగములు క్రిమిదష్టములై నశించెను. తరువాతఁ గొంతకాలమునకు నాపుస్తకము బైటఁ బడినపు డితరు లా శిథిలభాగములను బూరించిరి." ఇట్టిలేనిపోనియపవాదము మోపిరి. ఈ నింద హేతురహిత మైనది. పోతనామాత్యుఁడు భోగినీదండకము విరచించి సింగభూపతికిఁ గృతియిచ్చె నందురు గదా? ఇటులఁ బ్రభునియభిమతముప్రకారము ప్రవర్తించిన యాతఁడు భాగవతమును సింగనృపతికిఁ గృతి నీయకుండునా? అంతటిధీశాలియు నఖండపండితుఁడు నలంకారతత్త్వవేత్తయు భక్తశిఖామణియుఁగవిశిరోమణియు నైనమహానుభావుఁడు బమ్మెర పోతనామాత్యవిరచితమై భక్తిరసపూరితమైయొప్పు భాగవతమును బాఁతిపెట్టించుట యనుపాపపుఁబనికి నొడికట్టుకొనునా? పరోపకారముకొఱకేగదా మిగుల శ్రమగొని 'రసార్ణవసుధాకరము,' 'సంగీతసుధాకరము,' 'రత్నపాంచాలిక' మొదలగు సుద్గ్రంథముల రచించెను. అట్టి మహాకవి కీపా ట్లేల? కృతిభర్త యగుటకంటెఁ గృతికర్తయగుట ఘనతరముకదా? అది యటుండనిండు.

ఇంతకును నీభాగవతమునకుఁ బ్రతి యొక్కటే యుండునా? అంతటి కవివరేణ్యుఁడు రచించిన యుత్తమగ్రంథమునకు నొక్కటే ప్రతియుండెనా? మఱియు నీభాగవతభాగములను బూరించినశిష్యులు కొందఱు కలరుగదా? వీరీవిషయ మెందేనిఁ బొందుపఱిచిరా? శిష్యులిందఱుండినను గ్రంథమునకుఁ బ్రత్యంతరము లేకుండునా? లే దందముగాక! దీనికి మూల మైన వ్యాసరచితసంస్కృతభాగవత ముండెనుగదా? కవివరుఁడగు పోతరా జుండెనుగదా? ఆతనికిఁ గవితారచన యన మంచి నీరు ద్రాగుట యేకదా? ఆయన తిరిగి వ్రాసికొనలేకపోయెనా? మరల వ్రాయ లేఁడని యనుకొనునంతటియజ్ఞానియా? సర్వజ్ఞుఁడు పోతనభాగవతమును బఠించి యానందించి కృతార్థులగుభాగ్యమును లోకులకు లేకుండఁజేయునా?

ఇఁక నొకసంగతి. కవికిఁగాని యితరులకుఁగాని లభింపకుండునట్లు చేయఁదలంచినఁ దలంపవచ్చునుగాని యారసజ్ఞుఁడు తాఁజదివి యానంద మొందఁ దలంచియైన రహస్యముగఁ దనకడ నిడుకొన కుండునా? అదియును గాదందముగాక! ఎవరికిని లభింపకుండునటుల నీభాగవతమును దగులఁబెట్టించునుగాని యప్పుడో లేక మఱెప్పుడో యితరులకు దొరకునటులఁ బాఁతి పెట్టించునా? అఖండపండితుఁడై కవిశేఖరశిఖామణియైనయీ యశోవిశాలునకుఁ బోతనభాగవత మంకిత మీయనంతమాత్రమున లోటు వాటిల్లె నని యాతఁ డెంచినట్లు మనము దలంచుట యుచితము గాదు. ఇంతకు సర్వజ్ఞుఁడును బోతనయు సమకాలికులే కా రని యొకవాదము కలదు. అట్లగుచో నేబాధయు లేదు.

మఱియొకవాద మిందు వివరించెద. అది యేది యన: పోతనామాత్యుఁడు భాగవతమునందలిరసవత్తరము లైనభాగములనుమాత్రమే విరచించి, శేషించినవానిని దనశిష్యులు వ్రాయుటకై వదలెను. అవి యాతీరున నిర్మితము లయ్యె. కావునఁ బ్రప్రథమమున నవన్నియు నేరీతి రచింపఁబడెనో యాతీరుననే సరిగ మనకు లభించి, నేఁడుకూడ మనకడ సంపూర్ణముగ నున్నవి. అప్పుడు శిథిల మనుమాట కిసుమంతయు నవకాశ ముండదు. ఈవాదము సహేతుకమై సంతృప్తికరముగ నున్నది.

ఒకవిశేషవిషయ మిందుఁ గలదు. ఇతరులచేఁ బూరింపఁబడిన భాగములు స్కంధాదితోఁ బ్రారంభమై స్కంధాంతముతో ముగియును. నారయ, సింగన, గంగన యనుమువ్వురు కవు లీవడువుననే వ్రాసిరి. దీనివలనఁ దెలియున దే మన? వీరెవరిమట్టునకు వారు వారివారికథలను సంపూర్ణముగ వ్రాసికొని రనియు శిథిల మైనవానిని బూరించుట కాదనియు ననునంశము. రెండుస్థలములయందుమాత్రము కొన్నిపద్యములు నారయ రచించినటులఁ గొన్ని ప్రతులలో నున్నది. దీనికిఁ దృప్తికరములైనకారణములు గానరావు. శైలిలో నొకింతభేదముండవచ్చును. అంతమాత్రమున రచన పోతనది కా దనఁ దగదు. పోతనకవిత యని యెల్లరిచే నెన్నఁబడుకొన్నిస్థలముల శైలిలో భేదము కలదు. అనేకు లగుకవిపుంగవుల గ్రంథములలోఁ గూడ నీరీతియే కాననగు. నారయ, సింగన, గంగనలు తాము వ్రాసినగ్రంథములలోఁ దమయభిధానంబులఁ బొందుపఱిచియున్నారు. ద్వితీయదశమస్కంధభాగముల నితరకవులపేరులు కానరావు. పోతనామాత్యునిపవిత్రనామమే

కానసగును. దీనిని నమ్మకుండుటకును, రెండవవాదమును విశ్వసించుటకును దగినహేతువు లగపడవు. కావున నీభాగములు గూడఁ బోతనార్యవిరచితము లనియే యెంచనగును. భాగవత మంతయు బాగుగఁ బరిశీలించినచో నీవిషయము విశద మగును. ఈవాదమే మనమన్ననకుఁ దగియున్నదని నానమ్మకము.

నారయ, సింగన, గంగన లనుముప్పురుకవులలో నెవ్వరు నిటుల భాగవతభాగములు శిథిలము లైన వనుమాటయే యెత్తు కొనలేదు. పోతనార్యునిప్రియశిష్యుఁడైన నారయ యైనను దీనిని చెప్పకొనలేదు. ఈ కింవదంతి వాస్తవ మైనచో నీప్రియ శిష్యుఁడైన నుడివియుండఁడా? ఇది ముఖ్యమైనవిషయము. ఇంతియే కాదు. పోతనమహాకవిసమకాలికు లైన కవు లొకరైనను దీనిని వాకొనలేదు. కవివరు లైనపోతనపుత్త్రాదిబంధువు లెవ్వరునుగూడ నీవిషయము నెచ్చటను దెలుపరైరి. అటు పిమ్మటఁ గూచిమంచి తిమ్మకవికాలమువఱకు వెలసినవిద్వాంసుల గ్రంథములలో నెందును నీపరివాదము కానరాదు. ఏకారణము ననో తిమ్మకవి మాత్ర మటుల లిఖించెను. తిమ్మకవి తన కర్తృంతాభిమానము గలయభిప్రాయమున కనుకూలముగ నున్న దని రచించె నని తోఁచుచున్నది. సుప్రసిద్ధపరిశోధకులు నైన కందుకూరి వీరేశలింగముపంతులుగారును, గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారును తమ 'ఆంధ్రకవులచరిత్రము' నందును 'కవి జీవితములు'యందును నీయంశమును బాగుగఁ బరిశీలించి యీ ప్రవాద మసమంజస మైన దని త్రోసివైచిరి.

ఇఁక నొకయసందర్భము చూపట్టుచున్నది. అ దేది యందురా? ముద్రితము లైనభాగవతగ్రంథములపీఠికలలో రాజుల నిందించుపద్యములఁ గొందఱు పోతనకృతములుగా

నుదాహరించియున్నారు. పరిశీలింప నివి పోతనరచితములు కా వనియుఁ బోతనకుఁ బూర్వు లగుకవులచే రచింపఁబడిన గ్రంథములయం దీపద్యములు చూపట్టుచున్న వనియుఁ బండితులు నుడువుచున్నారు. ఈరీతిని బరులపద్యములఁ బోతన కృతములుగాఁ బ్రకటించుట యన్యాయము కాదా?

రత్నపాంచాలికానాటికయందు సర్వజ్ఞు లీక్రిందిశ్లోకమును వ్రాసియున్నారు.

"కళ్యాణమస్తు జగతాం సతతం త్రయాణాం
సంవర్ధితో భవతు వైదికఏవ మార్గః
సారస్వతాని సరసాని కవీశ్వరాణాం
మాత్సర్యదిగ్ధహృదయా న కలంకయంతు"

"ముల్లోకముల కెప్పుడు కల్యాణ మౌఁగాక! వైదిక మార్గమే వృద్ధిపొందింపఁబడుఁగాక! కవీశ్వరుల సరసములగు సారస్వతములఁగూర్చి మాత్సర్యమున మున్గినహృదయములు కలవారు కలంకములు పల్కకుందురుగాక!" *

ఈరీతిగా నీతివాక్యము తనకావ్యమున లిఖించి దీనికి వ్యతిరేకముగఁ బ్రవర్తించునా? అటులు చేసినచో నలుగురిలో నగుఁబా టగునుగదా. తాను లోకాతీతప్రజ్ఞాశాలియు సర్వజ్ఞ బిరుదాంకితుఁడును విద్వద్వతంసము నయ్యు వేఱొకశాస్త్రవేత్త వ్రాసినగ్రంథమునందు గౌరవము గనఁబఱచుచుఁ బరోపకార సంపన్నులై ఘనవ్యాఖ్యానము లిఖంచిన వినయనయశీలసం

---

* ఇందలి శ్లోకముల క్రింది యాంధ్రానువాదము శ్రీ శ్రీ ఉయ్యూరు రాజావారిచే వ్రాయఁబడినది.

వన్నులైన సింగన్నృపశిరోమణి మహాకవివరేణ్యుఁడు, భక్తాగ్ర గణ్యుఁడు నత్యంతపూతచరితుఁడు నైన పోతనామాత్యునిగాని, యాతఁడసమానలసమానశైలిని రసవత్తమముగను భక్తిరసపూరితముగను రచించినభాగవతగ్రంథరత్నమునుగాని నిరసించి యవమానించె ననుట యెంతమాత్రము సమంజసముగాదు.

ఈకారణములంబట్టి చూడ నీయపవాద మన్యాయ్యమైనదనియు నసంగత మనియు విదిత మగుచున్నది. కిట్టని వారు పుట్టించినయీయపనింద వట్టిబూటకము. విశ్వసింపఁ దగినది కా దని విజ్ఞులకు వేఱె విజ్ఞప్తిచేయుట యనవసరము. అశేషశేముషీవిభవాభిశోభితుఁడైనసర్వజ్ఞ సింగభూభుజుఁడు సర్వజ్ఞవరేణ్యుఁడై కవిశిఖామణియై యాలంకారిక చక్రవర్తియై విద్వద్వతంసుఁడై వంద్యుఁ డయ్యెను. వైయాకరణశిరోమణియై ప్రసిద్ధి గాంచెను. నాట్యకళాకోవిదుఁడై పొగడొందెను. సంగీత శాస్త్రపారంగతుఁడై భాసిల్లెను. ఆహా! ఈ మహామహునిమహిమాతిశయము? ఇట్టివారు వేఱేరీ? అతని కాతఁడే సాటి.

విద్వద్వంద్యులు పరమపూజ్యులు మహాప్రాజ్ఞులు నైన సర్వజ్ఞ సింగకవిసార్వభౌమా! సద్భక్తిపూర్వకముగ నేను సమర్పించుసాష్టాంగ నమస్కారసహస్రముల స్వీకరింపుఁడు!

సత్యాభిమాని,

రావు వేంకటకుమార మహీపతిసూర్యారావు,

పిఠాపురమహారాజు.



# పండితాభిప్రాయములు

## 1

శ్రీ శ్రీ శ్రీ సర్వజ్ఞ సింగభూపాల విరచితమగు "కువలయావళి" యను నాటికను జదివితిని. దీనికి 'రత్నపాంచాలిక' యను నామాంతరము కలదు. ఈనామ మీగ్రంథమందుఁ దుదిని ముద్రింపఁబడిన శ్లోకమూలమున వాడుకలోనికివచ్చెను. దృశ్యకావ్యములలో నీ శ్లోకముండుట కనర్హమగుటచే నాటికా బహిర్భూత మనకతీరదు. గ్రంథకర్తృసమ్మతము 'కువలయావళి' యను నామమే. గ్రంథకర్తకు 'సర్వజ్ఞ'యని యన్వర్థ బిరుదము కలదు. ఈ కవిప్రవరుని నచ్చటచ్చట సర్వజ్ఞపదము లేకయే కవులు నిర్దేశించుటచే నిది బిరుదమని చెప్పక తప్పదు. ఆకాలపు విద్వాంసు లీబిరుదము నుపాయనముచేసిరని నిశ్చయింపవచ్చును. వీరియెడ నీ బిరుదము శ్రీ శ్రీ శ్రీ పీఠికాపురాధీశులైన శ్రీరావు వెంకటకుమారమహీపతి సూర్యారావు మహారాజులుంగారు వ్రాసిన 'తొలిపలుకు' లో నిరూపింపఁబడి యున్నది. వీరిఁగూర్చి వైయాకరణశిరోమణిపదము తొలిపలుకులోఁ గాన్పించుచున్నది. అమరుఁడు నందనపదము పుంలింగముగనే యుండు నని చెప్పియున్నను దానిని త్రోసిపుచ్చి పాతంజలమహాభాష్యాదిపర్యాలోచనచే స్త్రీలింగముకూడ సాధువే యనిగ్రహించి 'విదర్భరాజనందనా'యని ప్రయోగించుట యాకవితల్లజుని వ్యాకరణజ్ఞానము నిరూఢమని వైయాకరణులు గ్రహింపకపోరు. ఈ గ్రంథమందలి శైలినిబట్టియు నిందలియితివృత్తము కల్పితమైనను, ఔచిత్యభంగము కలుగ

కుండ నౌచిత్యమును బాటించి రచించుటనుబట్టియు వీ రీనాటి కను కవితాపరిణతిదశలో వ్రాసిరని గ్రహింపవచ్చును. ఔచిత్యరక్షణకై తత్తత్పాత్రముల వాక్యములు ప్రాకృతభాషలో నుండునని నిశ్చయింపక తీరదు. ప్రాకృతభాషలోఁ బ్రకటింపఁబడినప్పుడే సహృదయు లిందలి యౌచిత్యమును బూర్తిగా గ్రహింపఁగలరు. కావున శ్రీశ్రీశ్రీ పిఠాపురాధీశ్వరులు ప్రాకృతభాషలోఁ జేర్చి యీ నాటికను బ్రకటించి గ్రంథకర్తృ గౌరవమును నితోధికముగా లోకవ్యాప్తమగునటులఁ జేయించె దరని నమ్ముచున్నాను. భాషాసేవమూలమున లోకోపకారము నందు బద్ధకంకణులైన శ్రీశ్రీశ్రీ పిఠాపురాధీశ్వరులైన శ్రీరావు వెంకటకుమారమహీపతి సూర్యారావు మహారాజులుంగారిని చిరాయురారోగ్యముల నిచ్చి భగవంతుఁడు రక్షించుఁగాత మని ప్రార్థించుచున్నాను.

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ,
తాతా సుబ్బారాయశాస్త్రి.

## 2

శ్రీశ్రీ పీఠికాపుర మహారాజావారి యాజ్ఞానుసారము ప్రచురింపఁబడిన యాంధ్రానువాదసహితరత్నపాంచాలిక యను నాటికను నామూలాగ్రముగాఁ జదివితిని. నాటికరసవంతమై శ్రీహర్ష రాజశేఖరుల నాటికలను బోలియున్నది. శ్రీ మహారాజా వారి తొలిపలుకును సావధానముగాఁ జదివితిని. అందు రత్నపాంచాలిక నాటిక గుణవిశేషములును, తత్కర్త గుణాతిశయములును సమగ్రముగాఁ బొందుపఱుపఁబడియున్నవి.

కృతిబహులకర్తయగు సింగభూపాలుఁడు కృత్యంతరభర్త కాలే కపోతి మనుకోపమున యాకృతిని నాశముఁజేయఁ బ్రయత్నించె ననునవ ప్రథను పరిశీలించి యది యసమంజసమని సోపపత్తికముగా శ్రీ మహారాజావారు నిరూపించి సత్యమును బయలుపుచ్చినందుకు ఆంధ్రలోకమంతయును వారికిఁ గృతజ్ఞులై యుండఁదగినది. శ్రీ మహారాజావారి విద్వన్నుతమైన పీఠిక సింగభూపాలుని రసార్ణవసుధాకరాద్యనేక గ్రంథకర్తృత్వ విషయమున సందేహమేమైనయున్నచోఁ బూర్తిగాఁ దొలఁగించుచున్నది. సింగభూపాలుని రసవంతమగు కృత్యంతరములను మనకు నచిరకాలములో లంభింపఁజేయుఁగాక యని భగవంతుని శ్రీ మహారాజావారితోపాటు నేనును బ్రార్థించుచున్నాను.

పరవస్తు వెంకటరామానుజస్వామి, ఎం. ఏ.

## 3

తన సర్వతోముఖపాండిత్యవైదగ్ధ్యగరిమచేత సకల విద్వజ్జన సమ్మతముగా సర్వజ్ఞ పదలాంఛనుఁడై, శ్రీరావు వంశాబ్ధి రాకాసుధాకరుఁడై, సకలాంధ్రజాత్యభిమానగౌరవాస్పదుఁడై 15-వ శతాబ్దమందు వెలసిన సింగభూపాలవరేణ్యుఁడు గీర్వాణ భాషలో రచించిన 'కువలయావలి'యను నాటికను దద్రావు కులదీపకులయిన శ్రీ పీఠికాపురమహారాజులు సాహిత్య చక్రవర్తి శ్రీశ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యరాయ బహద్దరువారు ప్రకటించి సుప్రసిద్ధమైయున్న తమ విద్యాసాహిత్య పోషణమునకును, నిరంతరసారస్వతసేవకును ననురూపముగా

నీ నాటిక నాంధ్రుల కందఁజేసి మఱియొకసారి యాంధ్రుల కృతజ్ఞతకుఁ బాత్రులయినారు.

ఈ నాటికకుఁ బీఠికగా శ్రీవారు రచించిన 'తొలిపలుకు' నం దాసర్వజ్ఞుని యఖండ శేముషీ వైదుష్యవిశేషములను సరస కవితాకౌశలమును విశదీకరించువిషయములు గలవు. అంతే కాక, యందు శ్రీవారు మఱియొక ముఖ్యవిషయమును సంపూర్ణముగాను, అప్రత్యాఖ్యేయముగాను విమర్శించి యాథార్థ్య మును బ్రతిపాదించినారు. సింగభూపాలుఁడు బమ్మెర పోతన రచించిన భాగవతమునకుఁ గృతిభర్త కాఁగోరినట్లును, దానికిఁ బోతన సమ్మతింపక పోవుటచేత నా భూపాలుఁడు కోపోద్దీపితుఁడై యా గ్రంథమును భూమిలోఁ బాఁతిపెట్టించినట్లును, అందుచేత గ్రంథమందలి భాగములు కొన్ని కృమిదష్టములై పోయినట్లును, బిమ్మట మఱికొంతకాలమునకు నా గ్రంథము బయలుపడఁగా శిథిలములైన భాగములను బోతన శిష్యులయిన నారయ సింగన గంగనలు పూర్తిగావించినట్లును బ్రవాద మొండు బమ్మెర పోతన తర్వాత మఱి మున్నూఱుసంవత్సరములకు గోదావరీతీరమందలి కూచిమంచి తిమ్మకవివలనఁ బుట్టినది. ఇది నిరాధారమైన ప్రవాదమని యాంధ్ర వాఙ్మయచరిత్ర పరి శోధకులయిన కందుకూరి వీరేశలింగము పంతులుగారు, గురు జాడ శ్రీరామమూర్తి పంతులుగారు మొదలయిన పండితులు తమ నిశ్చితాభిప్రాయమును స్పష్టముగాఁ దెలియఁజేసినారు. అంతేకాక, యాంధ్రభాగవతమందు స్కంధములు కొన్ని నార యాదులు రచించుటకుఁ బోతనామాత్యుఁడు పూర్తిగా నాంధ్రీ కరించిన గ్రంథము కృమిదష్టమగుటయే కారణమనుట యూహా కల్పితమేకాని సహేతుకముకాదు. కృమిదష్టమేయైనయెడల

నా స్కంధమునఁ గొంత యీ స్కంధమునఁ గొంత, యా ఘట్టమునఁ గొంత యీ ఘట్టమునఁ గొంత దష్టమైయుండును గాని యుద్దిష్టభాగములను గత్తిరించినట్లు పురుగులు ఘట్టముల యాద్యంతములు తెలిసికొని తినివేయునా? అసంభవము. అందుచేతఁ బోతనామాత్యుఁడు తన కిష్టమైనభాగము లాంధ్రీకరింపఁగా మిగిలినభాగములు నారయాదులు తమకు సాధ్యమైనరీతి నాంధ్రీకరించిరనుటయే సమంజసము. అప్పటికిని నిరాధారమైన యీ విపరీతపరీవాదమును వివేకములేక విశ్వసించినవారు కొందఱు తమ రచనలలో దీనిని వాస్తవమైన చరిత్రాంశముగా గ్రహించుట మిక్కిలి శోచనీయము.

సింగభూపాలుఁడు సర్వథా సద్గుణసంపన్నుఁ డనుటకు విశ్వేశ్వరవిద్వద్వతంసుఁడు రచించిన చమత్కారచంద్రిక యను నలంకారశాస్త్రగ్రంథమందలి "దానేన కర్ణో దయయా దిలీపో నయేనకావ్యో వినయేన రామః, యదిప్రసిద్ధిం దధతామమీభిః శ్రీ సింగభూపో నిఖిలైః ప్రసిద్ధః" అను శ్లోకము ప్రబలమైనప్రమాణము. "సారస్వతాని సరసాని కవీశ్వరాణాం మాత్సర్యదిగ్ధహృదయా న కలంకయంతు" (చూ. కువలయావలి భరతవాక్యము.) అని చెప్పిన సింగభూపాలున కిట్టి విపరీతమాత్సర్య మంటఁ గట్టుట ధర్మము కాదు.

ఇట్టి యసమంజసమైనపరీవాదమును ఖండించుటకై శ్రీ వారు సరియైనయుపపత్తులతోఁ గావించినవిమర్శనము సర్వథా సమంజసమైనదిగ వివేకు లందఱును గ్రహింతు రని నానమ్మకము.

'రత్నపాంచాలికా నామ నాటికా రసపేటికా' అని గ్రంథము చివర నున్నవాక్యము యథార్థమైనది. సింగ

భూపాలుఁడు శ్రీ వారు చెప్పినట్లు "సుమనోమనోజ్ఞ మైనకవితా ప్రజ్ఞకలిగి వెలింగెను. సంస్కృతనాటక కవిశిఖామణులైన కాళిదాస శూద్రక భవభూతులకుఁ దీసిపోవువాఁడు కాఁడు." కవిసార్వభౌముఁ డను బిరుదుపొందిన శ్రీనాథుఁడు చెప్పిన "దీనారటంకాల-సర్వజ్ఞ నామధేయము..." మొద లైనపద్యములనుబట్టియే యింతవఱకును సింగభూపాలుఁడు సర్వజ్ఞుఁడై యుండవలె ననుకొంటిమి. ఇప్పు డాసర్వజ్ఞుఁడు రచించిన 'రసార్ణవసుధాకర' మనునలంకారగ్రంథమును, శార్ఙ్గదేవకృత సంగీతరత్నాకరమునకు ఘన వ్యాఖ్యానమగు 'సుధాకర' మను గ్రంథమును, 'కువలయావలి' అను నాటికారత్నమును జదివి విన్నది యథార్థమని స్వయముగాఁ దెలిసికొనుట కవకాశముగలిగినది.

ఈనాటికమాత్రమే కాక తక్కిన రెండు గ్రంథములును నాంధ్రానువాదములతో శ్రీవారు ప్రకటింతురుగాక!

గిడుగు వేంకటసీతాపతి.

## 4

సరససారస్వతసముద్ధరణచణులును సాహిత్యచక్రవర్తియు నగు శ్రీ శ్రీ శ్రీ పీఠికాపుర సంస్థానాధీశ్వరులు ప్రచురించి యాదరమేదుర మగుసౌహార్దముతో నా కనిపిన 'రత్నపాంచాలిక'ను గృతజ్ఞ తాభివందనములతో నందుకొని యానందముతో నామూలాగ్రముగఁ జదివితిని. 'కువలయావళి' యను నామాంతరముగల యీనాటిక శ్రీ రావువంశ రత్నా

కరసుధాకరుఁడును, సాహిత్యవిద్యాపారంగతుఁడును, సంగీత కళావిశారదుఁడును, 'రసార్ణవసుధాకరాది మహోత్కృష్ట గ్రంథరాజముల రచించి, 'సర్వజ్ఞ' బిరుదాంచితుఁడయి తన యశశ్చంద్రికల దిగంతముల నలంకరించి మించిన కవిశేఖరుఁడు నయిన శ్రీ సింగభూపాలుని కృతిరత్నములలో నొకటి.

'జగమెఱిఁగిన బ్రాహ్మణునకు జందెం బేలా' యన్నట్లు కవిరాజ సార్వభౌముఁడైన శ్రీనాథునంతవానికి వెలుపు గల్గించు నసాధారణ పాండితీ వైభవముతో నొప్పారి విశ్వేశ్వరాది విద్వత్ప్రకాండ శ్లాఘ్యమాన సరససాహిత్య సౌభాగ్య ధురంధరుఁడయిన శ్రీ సింగభూకాంతుని కవితావిశేషములను బ్రశంసింప నెంచుట మముబోంట్లకు సముద్రమున కేతా మెత్తఁ దలంచుటయె.

ఈ కువలయావళి కథాసంవిధానమున శ్రీ హర్ష దేవ కృతమగు 'రత్నావళి' నొకింత పోలియున్నను, ఇందలి కల్పనాకౌశలము, రసభావపోషణము, చరిత్రచిత్రణము, ఔచితీ నిర్వహణము ననన్యాదృశములు. అభిజ్ఞానశాకుంతలంబున వలె నిం దందందుఁగల శ్లిష్టవచన చమత్కృతి కడుహృద్యము. రచనావిశేషము కళాపూర్ణోదయమునందలి యీ క్రిందిప్రశంసకు నెంతయుఁ దగియున్నదనవచ్చును.

చలువగలవెన్నెలల చెలువునకు సౌరభము గలిగినను సౌరభముఁ జలువయుఁ దలిర్పం, బొలుపెసఁగు కప్పురపుఁబలుకులకుఁ గోమలత నెలకొనిన సౌరభముఁ జలువపసయుం, గోమలతయును గలిగి జనముల మిగులఁ బెంపెసఁగు మలయపవనంపుఁగొదమలకు మధురత్వం, బలవడిన నీడు

మఱి కల దనఁగవచ్చుఁ గడు వెలయఁగల యీనుకవిపలుకు లకు నెంచన్.

ఈ కవిరాజశిఖామణి పాండిత్యప్రకర్షము, కవితావైభవము, సద్గుణసంపద మున్నగు విషయములంగూర్చి శ్రీశ్రీశ్రీ పీఠికాపుర మహారాజ శిఖామణులు తమ 'తొలిపలుకు'లో సంగ్రహారూపమున సముంచితముగఁ బ్రశంసించియున్నారు.

సకలకలావిశారదుఁడును, సరసకవితాధురంధరుఁడును, సత్కవిపండితసమాదరణశీలుఁడును, సుగుణాలవాలుఁడును, సర్వజనసంస్తుతి పాత్రుఁడును, స్వకీయవంశకర్తయునగు సర్వజ్ఞ సింగమహీభర్తపై నజ్ఞలోక మన్యాయముగ వైచిన నిరపరాధ నిందాపంకమును శ్రీవారు తమ యనర్గళనిర్గళ ద్వచోధారలచే నిశ్శేషముగఁ గడిగివైచిరి. ఈ సందర్భమున శ్రీమహారాజులవా రుపపాదించిన హేతువాద మత్యంతశ్లాఘాపాత్రము; అప్రత్యాఖ్యేయము; అనన్యసులభము. శ్రీవారాయపదూఱును బాపుటకై చూపిన యుపపత్తులలో నొక్కటొకటియు సత్యసంబద్ధము, అప్రతివచనీయము ననుట యథార్థకథనము.

భాస్కరుఁడు తాను దెనిఁగింపఁ బూనిన రామాయణమునఁ గొన్ని భాగములు తన పుత్త్రునిచేతను, మిత్త్రునిచేతను, ఛాత్త్రునిచేతను రచియింపించెననుట యాంధ్రలోకమున కవిదితము కాదుగదా. అట్లే పోతనామాత్యుఁడును నారయాదులచేఁ గొన్ని ఘట్టములు రచింపించియుండుట యసంభావ్యముగాదు. మఱియు సర్వజ్ఞునిపై నీయపప్రథ పోతన సమకాలికులెఱుంగరు. అనంతరకాలికులకుఁ దెలిసియున్నట్టును దోఁపదు. అర్వాచీనుఁడగు తిమ్మకవి కెట్లు తెలియవచ్చినది? నిరక్షరకుక్షులు చెప్పుకొను పుక్కిటిపురాణములను

బట్టి, ఆ వట్టిమాటలనుబట్టి యీ మహారాజకవి కట్టికలంకము నంటఁగట్టుట మహాపరాధమని చెప్పకతప్పదు. శ్రీ పీఠికాపురసంస్థానాధిపతుల యుపోద్ఘాతమును జదివినవెనుక నెవ్వరు నట్టి కింవదంతిని విశ్వసింపఁ బోరని నా నమ్మకము. నిత్య సత్యాభిమానులును నిరంతర సారస్వతాభిలాషులు నగు శ్రీ శ్రీ శ్రీ పీఠికాపురాధీశ్వరులకు సర్వేశ్వరుఁ డాయురారోగ్యైశ్వర్యాభివృద్ధు లొసంగి సర్వదా రక్షించుఁ గాత!

సత్యం జ్ఞాన మనంతం య జ్జగజ్జన్మాదికారణమ్ ।
శ్రేయసే భూయసే స్యాత్త త్సూర్యరాయమహీభృతః॥

ప్రయాగ వేంకటరామశాస్త్రి.

## 5

శృంగారరసపేటిక యగు నీ కువలయావలీ నాటికాకృతిప్రణేత శ్రీ సర్వజ్ఞ సింగ భూనేత, రసార్ణవ సుధాకర సంగీత సుధాకరాది మహాగ్రంథముల రచియించి వ్యాఖ్యాతృ చక్రవర్తి మల్లినాథసూరికిఁ బ్రామాణికుఁడైన మహా విద్వాంసుఁడు సంస్కృత భారతియందు వెలయు నీ నాటిక కొంతునగ వేషణంబు సేయించి మధురత రాంధ్రభారతి నీ కృతి ననువదింపఁజేసి శ్రీ పీఠికాపుర మహారాజేంద్రులు సింగభూపతి సంస్కృత కవితయనెడి యమృతరసమును నాంధ్రకృతియను చింతామణి పాత్రయందు నించి యాంధ్ర విద్వల్లోకమున కందించి కృతకృత్యులైరి.

చక్కని దేవాలయమును స్వర్గశిఖరితో నలంకరించునట్లు శ్రీ పీఠికాపురాధీశ్వరు లీ నాటికను తొలిపలుకుచే నలంకృతిఁ గావించిరి. అందు శ్రీ సర్వజ్ఞ సింగ భూపాలుని సద్గుణ విశిష్టతను సాహితీగరిష్ఠతను సవిస్తరముగ వర్ణించుటయేకాక జన సామాన్యవ్యాప్తమైన యొక యపప్రథను—అనఁగా పరమ భక్తాగ్రేసరుఁడగు బమ్మెర పోతనామాత్యుని భాగవతము వ్యాప్తము గాకుండ నీ సింగభూపతిఖిలమొనరించెనను పరంపరాయాతమగు నపవాదమును శ్రీ పీఠికాపుర మహా రాజేంద్రులు సయుక్తికముగ, సప్రమాణముగ శాస్త్రీయముగ విమర్శించి శ్రీ సింగ భూపాలచంద్రుని నా యపవాద కళంకము నుండి నిర్ముక్తుని గావించినారు. చారిత్రకరీతిని సమ్యక్పరిశీలనము గావించినను, సాహిత్యపథకమును సావధానముగ గమనించినను, గ్రంథరచనాక్రమమును సావకాశముగఁ బరిశీలించినను, తొలుత పోతన భాగవతగ్రంథమే యిట్టి స్థితికిఁ బాల్పడలేదని నిశ్శంకముగఁ బ్రమాణములున్నప్పుడింక సింగ భూపతి ప్రస్తావ మీ సందర్భమున కేవల కల్పితమని నిశ్చితమగుచున్నదిగదా. కావున నీ కథాకల్పనము కవిచరిత్రకారులును భాషా వాఙ్మయ పరిశోధకు లెవ్వరును నంగీకరింపలేదు. మఱియు నీ విషయము నోపపత్తికముగ నిరూపితమైనందున నీ పట్టున శ్రీ మహారాజేంద్రుల యభిప్రాయము—సింగ భూపతి నీ యపప్రథకుఁ బాల్పఱచుట అన్యాయము, అసంగతము, అసమంజసము అనునది జవాబు మహా విద్వజ్జనసమ్మతమును ప్రౌఢపాండితీవిమర్శకాభిప్రాయానుసారముగను నున్నదనుటలో సందియము లేదు.

వస్తుస్థితి యిట్లున్నను జనసామాన్యమున నీ యపప్రథ నేఁటివఱకు నెలకొనియుండుటచే 'అంగవ్రాతములోఁ జికిత్సకుఁడు దుష్టాంగంబుఖండించి, శేషాంగ శ్రేణికి రక్షసేయుక్రియ' శ్రీ పీఠికాపురాధీశ్వరు లిట్టి యవిమర్శితములును, నకారణకారితములును నసంబద్ధములునగు వానిని సహేతుకముగ, సంప్రదాయసిద్ధముగ సత్యసంబద్ధముగ ఖండించి, యాదర్శక విమర్శక కర్తవ్యమునుఁ బ్రకాశింపఁజేసి యాంధ్రభాషాయోషకుఁ బ్రాణమైన ప్రాచీనాంధ్ర వాఙ్మయమునకు సురక్షకులైరి.

అంధపరంపరాయాతములగు నపవాదములఁ బోఁగొట్టి యఖిల చైతన్యప్రదమగు వివేకతేజము నొసంగుటచే సాహిత్య చక్రవర్తి శ్రీ సూర్యారాయ మహారాజేంద్రు లన్వర్థనామధేయులై ప్రకాశించుచున్నారు.

నిడుదవోలు వేంకటరావు ఎం. ఏ.,

చెన్నపురి విశ్వవిద్యాలయమండలి ఆంధ్రభాషాధ్యాపకులు.

# చిన్న విన్నపము

పద్మనాయకాన్వయపద్మాకరదినమణులై సకలవిద్వజ్జన వినుతచరితులై యసమానగీర్వాణకావ్యనిర్మాణనిపుణులై వరేణ్యగుణభూషణులై వినుతి గాంచిన రావు సర్వజ్ఞసింగమణిధరణీరమణులచే సమకూర్పఁబడిన కావ్యరత్నములలో "రసార్ణవసుధాకరము" లలితసాహితీకళావిలాసవిన్యాసములకు మనోహరము లగులక్ష్యలక్షణముల వివరించునలంకారశాస్త్రగ్రంథము.

శ్రీ శ్రీ పీఠికాపురావనీంద్రులును సాహిత్యచక్రవర్తియునగు శ్రీ సూర్యరాయప్రభువరు లీగ్రంథమును బఠించి పరమానంద భరితులై సింగభూపాలవిరచితములగు నితర ప్రబంధములఁ గూడఁ జూడ నభిలాష కలవారైరి.

అంతఁ దిరువనంతపురమువారు నాగరలిపిలోఁ బ్రచురించిన కువలయావలీ నాటికయొక్క ప్రతి నొకదానిని మ-రా-రా-శ్రీ. నిడుదవోలు వేంకటరావు, ఎం. ఏ. గారు సంపాదించి శ్రీవారి కందిచ్చిరి. ఈ యమూల్యగ్రంథమును సంపాదింపఁగలిగినందు లకు ముందు శ్రీ వేంకటరావుగారి కభివందనములు.

శ్రీ శ్రీ పీఠికాపురప్రభువరులు కువలయావలి తమకడకు వచ్చినతోడనే నన్నుఁ బిలిపించి నావలన దానిని సాకల్యముగ నాకర్ణించి యందలి లలితకవితాచాతురికిని బ్రశస్తవస్తునిర్మితికిని హృదయంగమభావసంగతికిని సంతసించిరి.

ఈ నాటిక యథోచితముగా నాంధ్రీకరింపఁ జేయవలయు ననెడి కుతూహలముతోఁ దమ కత్యంత ప్రియమిత్రులును నుభయ భాషాకోవిదులును గావ్యనాటకాది గ్రంథ నిర్మాణ నిపుణులును నగు డాక్టరు గిడుగు, వేంకట సీతాపతి బి.ఏ., ఎల్.టి. గారితోఁ దమ యభిలాషను దెలుప సీతాపతిగారు రత్నపాంచాలికను శ్రీవారి కడనుండి కైకొని యనతి కాలము లోనే సుందరమగు నాంధ్రానువాదమును విరచించి శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు పండితులకుఁ జదివి వినిపించిరి. అంత నా పండితు లా యనువాదమునకుఁ దమ యామోదము మును దెలిపినవెంటనే శ్రీ శ్రీమహారాజా వారికి నాటికాంధ్రాను వాదమును జదివి వినిపింప శ్రీవారు మూలానువాదముల రెంటినిగలిపి ముద్రింపవలయునని సెలవిచ్చిరి.

శ్రీపీఠికాపురభూపవరు లీనాటికకుఁ బీఠికగా వ్రాసిన తొలిపలుకుల సర్వజ్ఞసింగనృపాలతిలకులపాండితీగరిమను గవితాప్రౌఢిమను దదితరగుణసంపదను జక్కఁగఁ జిత్రించియుండుటచే వానిని నే నెత్తికొననైతిని. లలితకవితాసుమసౌరభాస్వాదనాసక్తచిత్తులై కవిజనసంభావనాభిలాషాభూషితులై యనేకరసవత్కావ్యనిర్మాణచతురులై వెలసిన సింగభూవరులనిష్కలంకజీవితయశశ్చంద్రికకు గళంకము నాపాదించుపోతనభాగవతఖననగాథ నంటఁగట్టుట సమంజసమా? యనువిషయమును దీసికొని శ్రీ సూర్యరాయనృపాలావతంసులు చేసినవిమర్శనము వివేకశోభితమై విద్వన్నుతమై ప్రశస్తోపపత్తికమై విరాజిల్లుచున్నది.

నిరాధారమగు లోకాపవాదతిమిరమును దూరముగఁ దరిమివేయ నీసూర్యరాయభూరమణులు ప్రసరింపఁజేసిన సూక్తిమౌక్తికకాంతి సంస్తవనీయముగా వెలయుచున్న దనియు నపూర్వోపపత్తులతో నలరారుచున్న దనియుఁ బలువురు పండితులు ప్రశంసించియున్నారు. సందర్భశుద్ధి లేనియసత్యగాథల నాధారముగాఁ దీసికొని ఘనజీవితములఁ బంకిలములనుగాఁ జేయఁ జూచుట ప్రాజ్ఞులకు సహ్యముగాదుగదా. ఇట్టి కింవదంతులఁ దొలఁగించి సత్యములగు చరిత్రాంశముల లోకమునకుఁ దెలియఁజేయుట నిజసారస్వతాభిమానులకు విధియై యున్నది.

ఇందు శ్రీ సూర్యరాయావనీంద్రులు పొందుపఱచిన కింవదంతీనిరసనవిమర్శనరీతి నవలోకించుసహృదయులకు సింగభూజాని పోతనకృతిని గోతఁ బాఁతిపెట్టించెనను నపప్రథ పుట్టదిట్టములేని వట్టికట్టుకతగాని గట్టిపునాదికలకట్టడము కాదని విదితమగును. ఇంకముం దీనీలాపనింద సత్యమగు చరిత్రాంశముగ భావించువా రుండరనియే నావిశ్వాసము.

"స జాతో యేన జాతేన యాతి వంశ స్సముల్నతిమ్"
అను నార్యోక్తిచే ననుపమాన కావ్యనిర్మాణచతురులగు సర్వజ్ఞ సింగభూపాలురు శ్రీరావు వంశోద్యానవాటికను మున్ను నాఁటిన యశోవల్లరికి నేఁడు సరససారస్వతకోవిదులగు నీసూర్య రాయాంధ్రనీంద్రులు నిజగౌరవరసములఁ బ్రసరింపఁజేసి యద్దానిని నవపల్లవ శ్రీవిలసితమునుగాఁ జేయుటకై పాటుపడుట యెం తయుఁ బ్రశంసావహము. నిజాన్వయగౌరవపతాకల నిలువఁ బెట్ట నడుముగట్టువారే కులనందనపదార్హులు; సందియములేదు. ఇటుల నిజవంశౌన్నత్యమునకు నన్నెతలుఁగకుండఁ గాపాడ నభిలషించుచుఁ గవిపండితపోషకులై సత్కావ్యపఠనాసక్త చిత్తులై యసమానౌదార్యగుణశోభితులై వెలయు సాహిత్య చక్రవర్తి శ్రీ సూర్యరాయావనీంద్రు లాచంద్రతారకముగ సకలానందసంపదలతో వర్ధిల్లుదురుగావుత!

కాశీభట్ట సుబ్బయ్య శాస్త్రి
(శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు సంపాదకులు)



రత్నపాంచాలిక

యను నామాంతరముగల

# కువలయావళీనాటిక

శ్రీః

శ్రీ సింగభూపాలవిరచితా

# కువలయావలీ

శృంగారవీరసౌహార్దం
మార్ధ్యవైయాత్యసౌహృదమ్,
లాస్యతాండవసౌజన్యం
దాంపత్యం తద్భజామహే. ౧

అపిచ.—

బీజావాపముపేయివాన్ స్మృతివశాద్రాగోష్మణోద్భేదవా
నన్యోన్యస్య కరాంగులీఘటనయా ప్రాప్తప్రవాలోద్గమః,
విస్రంభేణ వికాసవాన్ సఫలతామైక్యేన సంభావయన్
కల్యాణం భవతాం కరోతు శివయోరానందకల్పద్రుమః. ౨

[నాద్యంతే]

శ్రీ ర స్తు.

శ్రీసింగభూపాల విరచితమయిన

# కువలయావళీనాటిక

అసమశృంగారవీరసౌహార్ద మగుచు
మార్ధ్యవైయాత్యసాహ్లాదమహిత మగుచు
లాస్యతాండవసౌజన్యలసిత మగుచు
నెసఁగుదాంపత్యమును భజియింతు మేము. 1.

మఱియు,

స్మరణవశమున బీజావాపమొంది
యొనరంగ రాగోష్మ నుద్భేదమొంది
యన్యోన్యరమ్యకరాంగుళీఘటన
యొప్పారఁగాఁ బ్రవాళోద్గమం బొంది
విస్రంభమునఁ జేసి వికసనం బొంది
యైక్యంబుచేత ఫలావాప్తి నొందు
గౌరీశ్వరానందకల్పద్రుమంబు
కళ్యాణ మొనఁగూర్చుఁగాక మీ కెపుడు. 2.

[నాంద్యంతమున]

సూత్రధారః:—అద్యాహం సకలసౌభాగ్యభాసురభవనామమ
రావళీవిభవవిలాసరేఖామణిముకురాయమాణాం ధరణీదేవ
తానవరత సంతన్యమాన సప్తతంతుసంతానధూమరేఖా
చ్ఛల విలిఖ్యమాన గగనలక్ష్మీగండమండలాభోగమృగమద
పత్త్ర భంగామభంగ విహరమాణ వీరభటకనక కేయూర
కోటీ సంఘట్టసంజాత జాతరూపరజఃపుంజపింజరిత రాజ
రథ్యాగణా మనంగపునరుజ్జీవనప్రసంగ మంగలాయతనా
రంభ విరచితనవకువలయతోరణ శ్రీవిడంబితరలత రాపాంగ
వారవిలాసినీజనవిరాజమానాం రాజశైలాభిధానాం రాజ
ధానీమధివసతః ప్రసన్నగోమలదేవస్య వసంతయాత్రా
మహోత్సవే సముత్సుకచేతసా సకలదిగంతసమాగతేన
నాగరికరాజసభాజనేన సభాజనపురస్సరమిదమాదిష్టోఽస్మి
"అయే, రంగలక్ష్మీనివాస! లలితకవితావిలాసచతురాననేన
చతురుదధివలయ వేల్లితవసుంధరాపరిణాహపరిగలత్కీర్తి
కర్పూరపూరాపహాసితాన్యరాజన్యగుణగౌరవేణ ప్రతిగండ
భైరవేణ భరితలక్ష్మీ సరస్వతీపరస్పరవిరోధపరివాద పరి
హారణప్రవీణనిజగుణతరంగితాంతరంగవిద్వజ్జనసభాజనపరా
యణేన ఖడ్గనారాయణేన మాన్యమహిలాగుణ విశేషలీలా
సదనోమాంబికావిదూర విశ్వంభరావిమలరత్నకందలేన
శ్రీమతా శ్రీసింగభూపాలేన ప్రణీతామఖండపరమానంద
వస్తుచమత్కారిణీం కువలయావళీం నామ నాటికాం
ప్రయోగతో దర్శయే"తి.

సూత్రధారుఁడు — సకలసౌభాగ్యములచే భాసురములయిన భవనములతో నలరారుచు, నమరావతీవిభవవిలాసరేఖలకు మణిదర్పణమువలెఁ బ్రకాశించుచు, భూసురు లనవరత మును జేయుచుండుయజ్ఞసంతానములయందలి ధూమరేఖ నెపమున గగనలక్ష్మీగండమండలాభోగమునందు రచితము లయినకస్తూరికాపత్త్రభంగముల విలసిల్లుచు, నిరంతరము విహరించుచుండు వీరభటుల బంగారుదండకడియములరాపి డికి రాలిన కనకరజఃపుంజములతోఁ బసిమివర్ణముగల రాజ వీథులతోఁ దనరారుచు, మన్మథుని నుజ్జీవింపఁజేయు ప్రసం గములతో మంగళనిలయమున కారంభమున విరచించిన నవకువలయతోరణలక్ష్మిని విడంబించు, తరలతరాపాంగ వారవిలాసినీజనముతో విరాజిల్లుచు నున్నరాచకొండయను రాజధాని నధివసించు ప్రసంగగోమలదేవుని వసంతయాత్రా మహోత్సవమునకు సముత్సుకచేతస్కు లయి సకలదిగంత ములనుండియు నేతెంచిన నాగరకరాజసభాజనులు సభాజన పురస్సరముగా నా కీరీతి నానతిచ్చిరి: "ఓయీ! రంగలక్ష్మిని వాసా! లలితకవితావిలాస చతురాననుండును, జతుస్సాగర వలయవేల్లిత భూతలమం దెల్ల వ్యాప్తమైన తనకీర్తికర్పూర పూరముచే నన్యరాజన్యగుణగౌరవముల నపహసించు వాఁడును బ్రతిగండభైరవుండును, లక్ష్మీసరస్వతుల పరస్పర విరోధ పరివాదమును బరిహరించుటయందుఁ బ్రవీణమగు నిజగుణముచేఁ దరంగితాంతరంగులగు విద్వజ్జనుల సభాజన

[సానుసంధానగౌరవమ్]

అహో సాహిత్యసౌభాగ్యం
శ్రీసింగధరణీపతేః,
శ్లాఘాయై యస్య సన్నద్ధా
విశ్వేశ్వరసరస్వతీ! 3.

[సహర్షమ్]

నేతా మన్మథకారణం యదుపతిః శ్రీయన్నపోతాత్మజో
నాట్యాలంకృతినిర్మితౌ పరిణతః శ్రీసింగభూపః కవిః,
ఏషా పండితమండలీ రసకలాసామ్రాజ్యసంజీవనీ
పుణ్యైనాద్య పురాకృతేన ఫలితో మే నాట్యవిద్యాశ్రమః.

మునకు భాజనుండును, ఖడ్గనారాయణుండును, మాన్య మహిళాగుణవిశేషములకు లీలాసదన మనఁదగిన యుమాం బికయను విదూరభూమికి విమలరత్నకందలుండును నగు శ్రీసింగభూపాలునిచే విరచితమయి, యఖండపరమానంద వస్తుచమత్కారము గల కువలయావళి యనునాటికను ప్రదర్శింపు” మని.

[అనుసంధానగౌరవముతో]

దేని విశ్వేశ్వర కవీంద్ర దివ్యవాణి
యభినుతింపఁగ సన్నద్ధయై చెలంగె
నట్టి శ్రీసింగధరణీశ్వరావతంస
సరససాహిత్యసౌభాగ్యగరిమ మసదె? 3.

[సంతోషముతో]

కథకునేత యా మన్మథకారణమగు
యదువిభుండు; తత్కర్త శ్రీయన్నపోత
సుతుఁడు నాట్యకళయు నలంకృతి రచింపఁ
బరిణతుండు శ్రీసింగభూపాలకుండు;

తనరు రసకళాసామ్రాజ్యమునకు జీవ
వసుధ యననొప్పు నీ పండితసభ; గాన
నాపురాకృతమైన పుణ్యమున నేఁటి
కహహా! పండె నా నాట్యవిద్యాశ్రమంబు. 4.

[నేపథ్యాభిముఖమవలోక్య]

ఆర్యే! కిమిదానీమపి విలంబసే?

[ప్రవిశ్య]

నటీ—(సవినయమ్) అయ్యఉత్త! సజ్జీకిఆ ణేపచ్ఛసామగ్గీ. తా దాణిం అత్త ఉత్తరకరణిజ్జం అణవేహి. (ఆర్యపుత్ర! సజ్జీకృతా నేపథ్యసామగ్రీ. తదిదానీమత్రోత్తరకరణీయమాజ్ఞాపయ)

సూత్రధారః:—

రుక్మిణీసత్యభామాదిసమేతపురుషోత్తమామ్,
ఉత్కంఠతే సభా ద్రష్టుం నేయం కువలయావళీమ్. ౫.

తదనుసంధీయతాం భూమికాపరిగ్రహః.

నటీ—అయ్యఉత్త! తుహ చిత్తాణుసరణం విణా మహ కిం అణ్ణం అత్థి? (ఆర్యపుత్ర! తవ చిత్తానుసరణం వినా మమ కిమన్యదస్తి.)

సూత్రధారః—సాధు కల్యాణశీలే! సాధు

వ్రతాని వర్ణనీయాని సంత్వన్యాని సహస్రశః,
పరం వ్రతం పురంధ్రీణాం పతిచిత్తానురంజనమ్. ౬.

[తెరవంకఁజూచి]

ప్రేయసీ! నీవింకను నాలసించుచున్న దానవేల?

[ప్రవేశించి]

నటి—(వినయముతో) ఆర్యపుత్త్రా! నేపథ్యసామగ్రి సజ్జీకృత మయినది. ఇంక నిప్పుడు చేయవలసినపని యేదియో యాజ్ఞాపింపుఁడు.

సూ.—

అల్ల రుక్మిణీసత్యభామాద్యనేక
యువతిజనపరీవృత పురుషోత్తమ యగు
కువలయావళిఁ జూడఁగాఁ గోరుచున్న
వార లీసభ్యు లౌత్సుక్యవంతు లగుచు. 5.

కావున భూమికాపరిగ్రహణ మనుసంధింతువు గాక!

న—ఆర్యపుత్త్రా! నీచిత్తము ననుసరించుటకంటె నన్యము నాకేమి గలదు?

సూ—బాగు; కళ్యాణశీలా! బాగు.

వర్ణనీయంబులైన సువ్రతము లవని
వేలకొలఁదిగ నితరముల్ వెలయుఁగాక!
పతిమనోఽనురంజన మనువ్రతమొకండె
సతుల కుత్తమంబగుచు సన్నుతి వహించు. 6.

[నేపథ్యే]

హాళా! సుదంఏదం ఇత్థిఆపురుసత్థసారం వఅణమ్?

(హాలా! శ్రుతమిదం స్త్రీపురుషార్థసారం వచనమ్?)

సూత్రధారః—(సహర్షమ్) అయే అయం కాలయవనవిజయాయ ప్రయాతే వాసుదేవే తదభ్యుదయకాంక్షీ విలాసోద్యానే సౌభాగ్యలక్ష్మీచిరంటికాప్రసాధనాయ మిశ్రితో రుక్మిణీప్రముఖదేవీపరిజనో మహానితఏవాభివర్తతే. తదేహి దూరమపసరావః.

[ఇతి నిష్క్రాంతౌ]

ఆముఖమ్

[తతః ప్రవిశతి దేవీజనో విభవతశ్చ పరిజనః.]

రుక్మిణీ—హాళా! తుమ్హేహిం సుదం ఇత్థిఆపురుసత్థసారం వఅణమ్. (హాలా! యుష్మాభిః శ్రుతం స్త్రీపురుషార్థసారం వచనమ్?)

ఇతరాః—మహాదేవి! సుదం విదిఅం పుణో పుణో సోదవ్వమ్. (మహాదేవి! శ్రుతం, విదితం; పునఃపునఃశ్రోతవ్యమ్)

[నేపథ్యమున]

సఖులారా! స్త్రీపురుషార్థసారమైన యీవచనము వింటిరా?

సూ—(సంతోషముతో) అదిగోఁ! గాలయవనుని జయించుట కేఁగిన వాసుదేవుని యభ్యుదయము నభిలషించుచు సౌభాగ్యలక్ష్మీసువాసినీప్రసాధనముకొఱకు విలాసోద్యానము నందు గలిసిన రుక్మిణీప్రముఖదేవీజన మీవైపునకే వచ్చుచున్నది. కావున, మనము దూరముగాఁ దొలఁగుదము రమ్ము.

[అని యిరువురును నిష్క్రమింతురు]

ఆముఖము

[అంతట దేవీజనము వైధవానుసారముగఁ బరిజనమును బ్రవేశింతురు]

(చూ. అను. పాట 1)

రుక్మిణి — సఖులారా! స్త్రీపురుషార్థసారమైన వచనము వింటిరి గదా?

ఇతరలు—వింటిమి; తెలిసికొంటిమి; అది మరలమరల వినఁదగి యున్నది.

రుక్మిణీ—(సస్మరణహర్షమ్) హళా! ఏదం ణారఅమహేసిణా వి లచ్ఛీఏ ఉవదిట్ఠమ్. (హలా! ఏతన్నారదమహర్షిణాపి లక్ష్మ్యై ఉపదిష్టమ్)

జాంబవతీ—మహాభాఏ! తారిసం దారిఅం అంతేఉరణ్ణాసం కదుఅ వరం ఆహావప్పిఓ అణ్ణేసిదుం గదో సో మహేసీదాణిం ణం పచ్చాగఓ. (మహాభాగే! తాదృశీం దారికామంతఃపురన్యాసం కృత్వా వరం ఆహవప్రియోఽన్వేషితుం గతః స మహర్షిరిదానీం నను ప్రత్యాగతః?)

రుక్మిణీ—అహఇం. (అథ కిమ్?)

కాళిందీ—దేవి! కిం సా ఏసా దారిఆ జాఇత్థిఆదిట్ఠీఏ ఇత్థిఆ పడిహాది పురుసదిట్ఠీఏ వి రఅణపంచాళిఅత్తి సుణీఅది? (దేవి! కిం సైషా దారికా యా స్త్రీదృష్ట్యా స్త్రీ ప్రతిభాతి, పురుషదృష్ట్యాపి రత్న పాంచాలికేతి శ్రూయతే.)

రుక్మిణీ—ఆమ భఇణీఏ! ఆమ. (ఆమ్ భగినికే! ఆమ్.)

సత్యభామా—(ఆత్మగతమ్) అహో ఉప్పింజళిఅసహావా రుక్మిణీ కింవి ణ ఆణాది. అయ్యఉత్తస్స చిత్తరంజణేకసీలో కపడణాడఅణివ్వాహణత్థుదివాదో ఖుసో సురేసీ. తేణ కమ్పిఇ విఅ మే అప్పా. (అహో! ఉత్పింజలితస్వభావా రుక్మిణీ కిమపి న జానాతి. ఆర్యపుత్రస్య చిత్తరంజనైకశీలః కపటనాటకనిర్వహణస్తుతివాదః ఖలు స సురర్షిః. తేన కంపత ఇవ మఆత్మా.)

రుక్మిణి—(స్మరణహర్షముతో) నారదమహర్షి దీనిని లక్ష్మికిసైత ముపదేశించెను.

జాంబవతి—మహాదేవి! అట్టియాదారిక నంతఃపురమున నిల్లడ వెట్టి వరుని వెదకుటకు సంగరప్రియుఁడు వెడలెను గదా యామహర్షి యిప్పుడు తిరిగివచ్చెనా?

రుక్మిణి—ఔను.

కాళింది—దేవీ! ఎవతె స్త్రీదృష్టికి స్త్రీవలెను బురుషదృష్టికి రత్నపాంచాలికవలెను గనఁబడునని విందుమో యామె యింకన్నెయా?

రుక్మిణి—ఔను, చెల్లెలా! ఔను.

సత్యభామ—(తనలో) అయ్యో! ఈ రుక్మిణి వట్టియమాయకు రాలు. ఏమియు నెఱుఁగదు. ఆర్యపుత్రునిచిత్తమును రంజింపఁజేయుటయే స్వభావముగల యామహర్షి కపట నాటకనిర్వహణమునకు సూత్రధార మొనర్చువాఁడు గావున నాయాత్మ కంపించుచున్నది.

మిత్రవిందా—దేవి! అయ్యఉత్తస్స వృత్తంతో ణ కోవిఉవళట్టో తస్స ముహాదో. సో కిళ కళహప్పిఓ తిభువణంపరిబ్భమఇ. (దేవి! ఆర్యపుత్రస్య వృత్తాంతో న కోఽప్యుపలబ్ధస్తస్య ముఖాత్. స కిల కలహప్రియస్త్రిభువనం పరిభ్రమతి.)

రుక్మిణీ—హాలా! సుణుహ సోహణం అయ్యఉత్తేణ వావాదిదో కిళ సో మహాసురో. (హలా! శృణుత శోభనమ్ ఆర్య పుత్రేణ వ్యాపాదితః కిల స మహాసురః)

ఇతరాః—పిఅం ణో పిఅం ణో. (ప్రియం నః, ప్రియం నః)

లక్ష్మణా—దేవి! తత్థేవ విళంబంతో కిత్తి చిట్ఠఇ అయ్యఉత్తో. (దేవి! తత్రైవ విలంబమానః కిమితి తిష్ఠత్యార్యపుత్రః?)

రుక్మిణీ—హాళా! దివ్వఆణేణ ణందణం తం సమాగదాఓవిహి వాసవప్పముహాఓ దేవదాఓ సహ జఅవృత్తంతేణ (త్తి) ణో కహిదం (హలా! దివ్యయానేన నందనం తత్ సమాగతా విధివాసవప్రముఖా దేవతాః సహజయవృత్తాంతేన (ఇతి) నః కథితమ్.)

సత్యభామా—తా అజ్జ పచ్చూసమ్మి అయ్యఉత్తో అహ్మాణం ణఅరం అళంకరిస్సది. (తదద్య ప్రత్యూష ఆర్యపుత్రో ఽస్మాకం నగరమలంకరిష్యతి.)

రుక్మిణీ—తహ ఏవ్వ. (తథైవ.)

[తతః ప్రవిశతి దివ్యేన రథేన నాయకో మాతలిశ్చ]

మిత్రవింద — అతనినోటనుండి యార్యపుత్రునివృత్తాంతమేమి యుఁ దెలియలేదా? ఆకలహప్రియుఁడు ముల్లోకములఁ దిరుగుచుండును గదా?

రుక్మిణి—సఖులారా! శుభవార్త వినుఁడు. ఆమహారాక్షసు నార్యపుత్రుఁడు సంహరించెను.

ఇతరలు—ఇది మాకెంతయుఁ బ్రియము.

లక్ష్మణ — దేవీ! ఆర్యపుత్రుఁ డచ్చటనే యాలసించుటకుఁ గారణమేమి?

రుక్మిణి—చెలులారా! ఈ విజయవార్తతోఁగూడ విరించివాస వాది దేవతలు విమానారూఢులయి నందనవనమునకు విచ్చేసి రని తెలియవచ్చినది.

సత్యభామ—అట్లయినయెడల నార్యపుత్రుఁ డీ ప్రభాతముననే మన నగరము నలంకరింపఁగలఁడు.

రుక్మిణి—ఔనట్లే.

[వెంటనే దివ్యరథారూఢులై నాయకుఁడును
మాతలియుఁ బ్రవేశింతురు]

నాయకః—ఆర్య! మాతలే! భగవతో మహేంద్రస్య సంభావనయా కృతార్థమాత్మానం మన్యే.

మాతలిః—దేవ! కిముచ్యతే? భవదనుగ్రహాదవిచలితదివ్యసింహాసనః ఖలు భగవాన్ పాకశాసనః?

నాయకః—సన్విదంవిదర్భరాజనందనావిలాసోద్యానమ్. తదత్రావతరితుమిచ్ఛామి. (తథాకృత్వా) సూత! సుఖేన గమ్యతామ్.

మాతలిః—తథా (ఇతి సరథో నిష్క్రాంతః)

సుశీలా—మహాభాఏ! కహిం దాణిం సా దారిఆ? (మహాభాగే కుత్రేదానీం సా దారికా)

రుక్మిణీ—హళా! అజ్జ మఏ ఏవ్వ అణుమదా చందలేహాఏసమం ఉజ్జాణసిరిం పేచ్ఛిదుం గదా. (హలా! అద్య మయైవానుమతా చంద్రలేఖయా సమముద్యానశ్రియం ప్రేక్షితుం గతా.)

సత్యభామా — (సప్రణయోపాలంభమ్) హళా! తుమం వి ముద్ధసహావా ఖు, జంఅపరిచిదేసు ణికుంజప్పదేసేసు పరకిఅం దారిఅం సంచారేసి. (హలా! త్వమపి ముగ్ధస్వభావా ఖలు యదపరిచితేషు నికుంజప్రదేశేషు పరకీయాం దారికాం సంచారయసి)

ఇతరాః—ఏవ్వం ఏవ్వ ఏదం. (ఏవమేవైతత్.)

నాయకుఁడు—ఆర్యా! మాతలీ! పూజ్యుఁడైన మహేంద్రుఁడు గారవించుటచేతఁ గృతార్థుఁడ నయితినని భావింతును.

మాతలి—దేవా! ఏమనుచున్నారు? మా ప్రభువు తనదివ్య సింహాసనము కదలకుండుటకుఁ గారణము మీయను గ్రహామే కదా?

నాయకుఁడు—ఇది విదర్భరాజనందన విలాసోద్యానముగదా! కావున, నేనిట దిగెదను. (అట్లునేసి) మాతలీ! యింక నీవు సుఖముగాఁ బొమ్ము.

మాతలి—చిత్తము. (అని రథము తోలుకొని పోవును)

సుశీల—దేవీ! యిప్పుడాకన్య యెచ్చట నున్నది?

రుక్మిణి—చెలీ! యిప్పుడు నాయనుమతిని బొందియే చంద్రలేఖతోఁ గూడ నుద్యానశోభను జూడవెడలినది.

సత్యభామ—(ప్రణయోపాలంభముతో) అక్కా! యెంతబేల వమ్మా! పరిచితములుకాని యాపొదరిండ్లలోఁ బరకీయదారి కను దిరుగనిచ్చుచున్నదానవు.

ఇతరలు—అవునమ్మా.

రుక్మిణీ—(సాంగీకారం) హళా! ఆఅచ్ఛహ। తందారిఅం ఆకారిఊణ చిరండిఆ పసాహణం కరేహ్మ. (హలా! ఆగచ్ఛత। తాం దారికామాకార్యచిరంటికాప్రసాధనంకుర్మః.)

[ఇతి సదేవీజనా నిష్క్రాంతా]

నాయకః—(కించిదుచ్చైః) కాత్ర భో కేలీవనపాలికాసు.

[ప్రవిశ్య]

వనపాలికా—(సప్రణామమ్) ఆణవేదు, దేవ్వో। (ఆజ్ఞాపయతు దేవః)

నాయకః—సహకారికే! కిమిదానీమపి నావచిత ప్రసూన కిసలయం విలాసోద్యానమ్.

వనపాలికా — దేవ్వస్స విజఅమంగళానుసంధాణకాళణాదో దేవీహిం ఎత్థఏవ్వ మిళిదాహిం చిరండిఆపసాహణం సహత్థావచిదమంజరీహిం కాదవ్వం త్తి. (దేవస్య విజయమంగళానుసంధానకారణాద్దేవీభిరత్రైవ మిళితాభిశ్చిరంటికాప్రసాధనం స్వహస్తాపచిత మంజరీభిః కర్తవ్యమితి)

నాయకః—హంత! పరమస్తాసు కల్యాణపరంపరాను సంధానప్రయాససహిష్ణుతా దేవీనామ్। తదహ మతర్కితావలోకన ప్రదానేన దేవీనాం ప్రమోద వినయలజ్జా సంభ్రమ వ్యతికరదశామను భవితుమిచ్ఛామి। న తావదావేదయతు

రుక్మిణి—(అంగీకారముతో) సఖులారా! రండు, ఆదారికను రావించి సువాసినీప్రసాధనము గావింతము.

(చూ. అను. పాట 2)

[అని దేవీజనముతో నిష్క్రమించును]

నాయకుఁడు—(కొంచెము బిగ్గరగా)

కేళీవనపాలికలు! ఎవరక్కడ?

[ప్రవేశించి]

వనపాలిక—(నమస్కరించుచు) దేవా! ఏమి సెలవు?

నాయకుఁడు—సహకారికా! ఏమి? ఇంతవఱకు నీలీలావిలాసోద్యానమునందలిపూవులను జిగుళ్లను గోయకుండుటకుఁ గారణమేమి?

వనపాలిక—దేవరవారివిజయమంగళానుసంధానమునకై యిక్కడనే సమావిష్టలయినదేవేరులు స్వయముగాఁ దమహస్తములతోఁ గోసిన మంజరులతోనే సువాసినీప్రసాధనము గావింపఁ దలఁచిరి.

నాయకుఁడు—అహెూ! మా కళ్యాణపరంపరల యనుసంధాన ప్రయాసమందు దేవేరులకుఁగలయోరిమి మెచ్చఁదగినది. మేమిప్పుడు తలఁపనితలంపుగా దర్శనమిచ్చి దేవేరులకుఁ గలుగు ప్రమోదవినయలజ్జాసంభ్రమమిశ్రమైన యవస్థను

భవతీ మదాగమనమ్ । కర్ణేచ విదితవృత్తాంతం విధాయ తమితః శ్రీవత్సం ప్రేషయ.

సహకారికా—తహ (తథా) (ఇతి నిష్క్రాంతా)

నాయకః—(సౌత్సుక్యమ్)

మిలితానాం సుజాతానాం
స్వచ్ఛానాం మమ మానసమ్,
రత్నానామివ దేవీనాం
బృందమానంద యిష్యతి. ౭

(పురో నిరూప్య) అహో విలాసోద్యానస్య రామణీయక విలాసః । ఇహ హి.

అతిమధురకంఠనాళై
రభినవ సహకార కిసలయాస్వాదాత్,
కలకంఠై స్తరులతికాః
పరస్పరాలాప సుఖమివాదధతే. ౮

(నిర్వర్ణ్య) హంత! నాయం కోకిలాలాపః । కింతు కయో రపి కన్యకయోః సల్లాపః.

[ప్రవిశ్య]

చంద్రలేఖా—హాళా! ఇదోఇదో. (హలా! ఇత ఇతః)

నాయకః—(సవిస్మయం) కథమియం విదగ్ధాపి ప్రముగ్ధేవ రత్న పాంచాలికామాలపతి చంద్రలేఖా.

జూచి యానందింపఁ గోరుచున్నాము; గావున, నీవంతవఱకును మారాక వారి కెఱింగింపవలదు. శ్రీవత్సునికి మాత్రము చెవిలో రహస్యముగా నీవృత్తాంతము దెలియఁజేసి యతని నిక్కడికిఁ బంపుము.

వనపాలిక—చిత్తము: (అని నిష్క్రమించును)

నాయకుఁడు—(కౌతుకముతో)

స్వచ్ఛములు సుజాతంబులు సమ్మిళితము
లయిన రత్నంబులనుబోలి యలరుచుండు
దేవెరులబృంద మిచ్చోట దృశ్యమగుచు
నహాహా! నాడెంద మానంద మందఁజేయు. 7

(ఎదుటితట్టు తేఱిచూచుచు) ఓహో! యేమి
యీ విలాసోద్యానరామణీయక విలాసము!

ఈ వైపున,—

కమ్రకొమ్మావిచివురులఁ గఱచిమెసవ
సుమధురములైన కంఠనాళములతోడఁ
దనరుకలకంఠములచేతఁ దరులతలు ప
రస్పరాలాపసుఖమొందు రహిఁ జెలంగు. 8

(పరికించి) బళిరె! ఇది కోకిలాలాపము గాదు.
ఎవరిదో యిరువురకన్యకల సల్లాపము.

[ప్రవేశించి]

చంద్రలేఖ—చెలీ! ఇటు, ఇటు.

నాయకుఁడు—(ఆశ్చర్యముతో) ఏమిది? ఈచంద్రలేఖవిదగ్ధయయ్యును ముగ్ధవలె రత్నపుబొమ్మతో సంభాషించుచున్నదేమి?

[ప్రవిశ్య]

కువలయావలీ—హాళా! చందళేహే! అకిత్తిమేణ తుహ సిణేహేణ ఉల్లసిదో మే అప్పా. (హాలా! చంద్రలేఖే! అకృత్రిమేణ తవ స్నేహేన ఉల్లసితో మే ఆత్మా)

చంద్రలేఖా—హాళా! సిళాహణిజ్జో ఖుసహావసిద్ధో కువళయావళీ చందళేహాణం సిణేహాణుబంధో. (హాలా! శ్లాఘనీయః ఖలు స్వభావసిద్ధః కువలయావళీ చంద్రలేఖయోః స్నేహానుబంధః)

నాయకః—

రత్నపాంచాలికైవేయ
మితి గృహ్ణామి చక్షుషా,
లీలయాప్యనుమానేన
నేతి ప్రత్యేమి కిన్విదమ్.

చంద్రలేఖా—(సఖీం నిర్వర్ణ్య) హాళా! తుమం అంతేఉరం ఆణీదేణ ణారవేణ దేవీణం సోభగ్గగవ్వో ణివ్వాసిదోత్తి తక్కేమి. (హాలా! త్వామంతః పురమానీతేన నారదేన దేవీనాం సౌభాగ్యగర్వో నిర్వాసిత ఇతి తర్కయామి)

కువలయావలీ—(సప్రణయాసూయమ్) హాళా! కహం విఅ! కహేహిసుణామి దావ ణమ్. (హాలా! కథమివ? కథయ శృణోమి తావదేనమ్)

చంద్రలేఖా—అణ్ణహా కణ్ణఆరఅణం తుమం తిహువణేక్కమల్లస్స ఖత్తిఅకుమాళస్స భుఅంతరాళేకక మండణం కుణందో మాణిక్కం విఅ మంజూసాఏ ణారఅమహేసీ అంతేఉరంమి థక్కేఇ (అన్యథా కన్యకారత్నం త్వాం

[ప్రవేశించి]

(చూ. అను. పాట. 3)

కువలయావళి—చెలీ! చంద్రలేఖా! కృత్రిమమెఱుఁగని నీస్నేహముచే నాయాత్మ యుల్లసితమగుచున్నది.

చంద్రలేఖ—చెలీ! స్వభావసిద్ధమైన కువలయావళీ చంద్రలేఖల సంబంధము శ్లాఘనీయమేకదా?

నాయకుఁడు—

ఈమె రత్నపాంచాలికయే యటంచుఁ
గన్నులను గాంచి యనుకొంటిఁగాని యటులఁ
గామి లీలానుమానమ్ముకలనఁ దోఁచు
దీని యాథార్థ్యమేమియో తెలియరాదు. 9

చంద్రలేఖ—(సఖినిబరికించి) చెలీ! నారదుఁడు నిన్నంతఃపురమునకుఁ దెచ్చియుంచుటచేత దేవీజనసౌభాగ్యగర్వము నడంచెనని తలంతును.

కువలయావళి—(ప్రణయాసూయతో) చెలీ! అదెట్లో చెప్పుము, విందును.

చంద్రలేఖ — అట్లుకానిచోఁ గన్యకారత్నమవయిన నిన్ను త్రిభువనైకమల్లుండగు క్షత్రియకుమారునిభుజాంతరాళైకమండనముగాఁ జేయుచు మంజూషయందు మాణిక్యముంచి నట్లంతఃపురమందు నారదమహర్షి యుంచునా?

త్రిభువనైకమల్లస్య క్షత్రియకుమారస్య భుజాంతరాళైక మండనం కుర్వన్ మాణిక్యమివ మంజూషాయాం నారద మహర్షిరంతః పురే స్థాపయతి)

నాయకః—

హంతేయం క్షత్రియాయ ప్రతిపాదనీయా। అన్యథా కథ మస్మదంతఃపురే స్థాపయతి భగవాన్, వైరించిః। (విచింత్య) కథం ను ఖల్విదం యదియ మస్మచ్చక్షుషోః ప్రతీయతే రత్న పాంచాలికైవేతి.

కువలయావలీ—హాళా! తుమం జం కిం వి ఆళవేహి। అహం ఉణ తుజ్ఝ చఉరాళావిణీఅ అహిప్పాఅం ణ ఆణామి. (హాలా! త్వం యత్ కిమప్యాలప. అహం పునస్తవ చతురాలాపిన్యా అభిప్రాయం నజానామి)

చంద్రలేఖా—హాళా! ణవజొవ్వణస్స సహాఆరీ భఅవం వమ్మహో ఏవ్వ సవ్వం జాణావిస్సది. (హాలా! నవయౌవనస్య సహకారీ భగవాన్ మన్మథ ఏవ సర్వం జ్ఞాపయిష్యతి)

నాయకః—

సేయమలక్షిత రూపా
నఖసహాలాప సూచితౌదార్యా,
సౌరభవిదితవిశేషా
కేతకలతికేవ హరతి మే చేతః. ౧౦

చంద్రలేఖా—హాళా! ఇదో పేచ్ఛ మఅణరజ్జసంజీవిణిం తుమం పేచ్ఛిదుం వ ఓఇణ్ణస్స విళాసుజ్జాణ మాహావస్స సిరిం. (హాలా! ఇతః పశ్య మదనరాజ్యసంజీవినీం త్వాం ప్రేక్షితు మివావతీర్ణస్య విలాసోద్యాన మాధవస్య శ్రియమ్)

నాయకుఁడు—ఓహో! యీయామె క్షత్త్రియున కీయఁదగినదే. కానిచోఁ బూజ్యుఁడైన యా విరించినందనుఁ డీకన్యను నా యంతఃపురమున నేల యుంచును? (ఆలోచించి) ఇదియేమి? నాకన్నులకీమె రత్నపాంచాలికవలెనే కనఁబడుచున్నదే!

కువలయావళి—చెలీ! నీవేదియో పలుకుము. చతురాలాపినివైన నీయభిప్రాయము మాత్రము నాకుఁ దెలియదు.

చంద్రలేఖ—చెలీ! నవయౌవనమునకు సహకారియైన మన్మథ భగవానుఁడే సర్వమును దెలియఁజేయఁగలఁడు.

నాయకుఁడు—పరులు లక్షింపరాని రూపంబుతోడఁ
దత్సఖీగోష్ఠి సూచితౌదార్యయగుచు
స్వీయసౌరభవిదిత విశేషయయిన
కేతకివలె హరించె నాచేత మీయామె.

చంద్రలేఖ—చెలీ! మదనరాజ్యసంజీవినివగునిన్ను వీక్షించుట కవతరించిన యీవిలాసోద్యానమాధవునిశోభ యిదిగో నిట గనుము.

కువలయావళీ—(సలజ్జాకౌతుకమ్) హళా! ఏతస్సిం ణిఉంజే ఓసరిదాఓ రుక్కిణీవల్లహం విజయజేత్తాదో పడిణివుత్తం పేచ్ఛామో అయ్యఉత్తమ్ (హలా! ఏతస్మిన్ నికుంజేఽప సృతే రుక్మిణీవల్లభం విజయయాత్రాతః ప్రతినివృత్తం పశ్యావ ఆర్యపుత్రమ్)

చంద్రలేఖా—(ఆత్మగతమ్) అంహెహ్మా జహ ణామసరిసేణ వం చిదా । హొదుదావ । ణం అణుసరిఅ విణోఏమి (ప్రకాశమ్) జహ పిఅసహీఏ రోఅది. (అహెహ్మా యథా నామ సాదృశ్యేన వంచితా. భవతు తావత్. ఏనామను సృత్యవినోదయామి. యథాప్రియ సఖ్యైరోచతే)

[తథాకురుతః]

కువలయావళీ—(సౌత్సుక్యమవలోక్య) హళా! కహిం సో మహాణుభావో. (హలా! కుత్రసమహానుభావః?)

చంద్రలేఖా—హళా! భణామి పురదో వసంతో ఏవ్వ మాహ వోత్తి । తా అణ్ణం చింతిదం ఉజ్ఝిఅ పేచ్ఛ ణం. (హలా! భణామి పురతో వసంత ఏవ మాధవ ఇతి. తదన్యత్ చింతితం త్యక్త్వా పశ్యైనమ్)

నాయకః—(సశంకావిమర్శమ్) న ఖలు కిమిహ నిగూఢస్థితోఽపి జ్ఞాతోఽహమనయా విదగ్ధచేట్యా.

కువలయావళీ—(పునర్విలోక్య సవిషాదం) హళా! కహిం సో జఉఉళసేహరో మాహవో జం పురతో వసంతోత్తి తుమం భణాసి. (హలా! కుత్రస యదుకులశేఖరో మాధవః, యం పురతో వసన్నితి త్వం భణసి.)

కువలయావళి—(లజ్జాకౌతుకములతో) సఖీ! ఈ నికుంజమందు డాఁగి విజయయాత్రనుండి యేతెంచినయా రుక్మిణీవల్లభుని ఆర్యపుత్రుని గనుఁగొందము.

చంద్రలేఖ—(తనలో) ఓహో! నామసాదృశ్యముచేత నీమె వంచితురాలైనది. కానిమ్ము. ఈమెకుఁ దగినట్లే నేను వినోద మొదవింతును. (ప్రకాశముగా) అట్లే చేయుదము (అట్లొనరింతురు)

కువలయావళి—(కౌతుకముతోఁ జూచి) చెలీ! ఆ మహానుభావుఁడెక్కడ?

చంద్రలేఖ—సఖీ! ఎదుట వసించియున్నవానినే (వసంతునే) నేను మాధవుఁడనుచున్నదానను; కావున నన్యచింతను మాని వీనిని జూడుము.

నాయకుఁడు—(శంకావిమర్శలతో) విదగ్ధయగునీచేటి నిగూఢుఁడనైయున్న నన్ను దెలిసికొనియుండలేదుగద?

కువలయావళి—(మరలఁజూచి విషాదముతో) ఎదుటనున్నాఁడని నీవనుచున్న మాధవుఁ డాయదుకులశేఖరుఁ డేడీ? ఎచ్చటనున్నాఁడు?

చంద్రలేఖా—(సస్మితమ్) హాళా! మఏభణిదో ఋదుఉళసేహారో మాహవో ఆరామమ్మి సవ్వదా దీసఇ. తుఏ ఉణ పరిణ్ణాదో జఉఉళసేహరో మాహవో కహిం వా ణ ఆణామి. (హాలా! మయాభణితః ఋతుకుల శేఖరో మాధవ ఆరామే సర్వదా దృశ్యతే. త్వయాపునః పరిజ్ఞాతో యదుకుల శేఖరో మాధవః కుత్రవా న జానామి.)

నాయకః—సాధు చంద్రలేఖే! సాధు!

అపూర్వసంవిధానేన
తరంగిత చమత్కృతేః,
పారితోషికదానేఽహ
మధమర్ణో భవామితే. ౧౧

కువలయావలీ—హాళా! తుఏ ఏవ్వం వంచిదహ్మి. (హాలా! త్వయైవం వంచితాస్మి.)

చంద్రలేఖా—హాళా! తుఏ ఏవ్వ తుమం వంచిదా ణ ఉణ మఏ। జం అత్థంతరే అహిణివిట్ఠాసి. (హాలా! త్వయైవ త్వం వంచితా, న పునర్మయా. యదర్థాంతరేఽభినివిష్టాసి.)

కువలయావలీ—హాళా! సిణిద్ధజణవంచణసీళా ఏ తుహ సహిత్తణం విసజ్జేమి. (హాలా! స్నిగ్ధజన వంచనశీలాయాస్తవ సఖిత్వం విసర్జయామి.) (ఇతి పదాంతరే తిష్ఠతి).

చంద్రలేఖా—(కనిష్ఠికాయాం గృహీత్వా) హాళా! మా కువ్వ ణమ్మకేళీఏ. (హాలా! మాకుప్య నర్మకేల్యా).

చంద్రలేఖ—(మందహాసముతో) నే ననినమాధవుఁడు ఋతుకుల శేఖరుఁడు; సర్వదా యారామమునఁ గనఁబడుచుండును. నీవనుకొనినమాధవుఁడు యదుకులశేఖరుఁడు; ఎచ్చట నున్నాఁడో నేనెఱుఁగను.

నాయకుఁడు—సెబాసు! చంద్రలేఖా! సెబాసు!

నవ్యమయినట్టి సంవిధానంబుతోడ
వెల్లివిరియుచమత్కృతి వెల్వడించు
నీకుఁ బారితోషికమొండు నేనొసంగ
నప్పుపడియున్నవాఁడ నంచాత్మఁ దలఁతు. 11

కువలయావళి—చెలీ! నీచే నేనిట్లు వంచితనైతిని.

చంద్రలేఖ — అర్థాంతరమం దభినివేశముగలదానవు గనుక నిన్ను నీవే వంచించుకొంటివి; నేను వంచింపలేదు.

కువలయావళి—చెలీ! కూరిమిగలవారినే వంచించుశీలముగల నీతోడిచెలిమి విడిచెదను (అని వెడలుటకొకయడుగుపెట్టి నిలుచును.)

చంద్రలేఖ—(కువలయావళి చిటికెనవ్రేలుపట్టుకొని) చెలీ! పరిహాసమునకుఁ గోపింపవలదు.

[కువలయావళీ బలాదంగులీమాకృష్య పునరపి
పదాంతరే క్షిపతి.]

చంద్రలేఖా—బలిఅం ఖు కుపిదా ఏసా జేణ గళిఅం వి మణి ముద్దిఅం ణ ఆణాది । తా ణం గహ్ణిఅ ఠ క్కేమి. (బలీయః ఖలు కుపితైషా: యేన గలితామపి మణిముద్రికాం నజానాతి. తదేనాం గృహీత్వాస్థాపయామి). (తథా కరోతి.)

నాయకః—(సవిస్మయమ్)

దృష్టిప్రతిబంధకృతా
ముక్తా ప్రతిభాతి హేతునా నేయమ్,
ఝటితి చ వనితావరణా
శస్త్రీః శాతేవ శంబరారాతేః. ౧౨

హంత ఫలితోఽయమస్మాకమనుసరణ వ్యాపారః.

యతః,

సంచారిణీ రతిపతేరివ వైజయంతీ
సాక్షాత్కృతా రతిపతేరధిదేవతేవ,
మూర్తా జగజ్జనదృశామివ భాగ్యరేఖా
శాతోదరీ నయనగోచరతా ముపైతి. ౧౩

(చిరం నిర్వర్ణ్య) నఖల్వియం స్త్రీమాత్రమ్, కింతు
కుసుమాయుధ లక్ష్మీర్వా
మోహనవిద్యావిలాసరేఖా వా,
సౌభాగ్యకందలీ వా

[కువలయావళి బలాత్కారముగాఁ దనవ్రేలులాగికొని మరల మఱియొకయడుగు పెట్టి నిలుచును]

చంద్రలేఖ—ఈమె యెక్కువగానే కోపము వహించియున్నది; గావున ముద్రికజాఱిపోవుటయైనను దెలిసికొనలేదు; గనుక, నే నీమెను బట్టియాఁపెదను (అట్లుసేయును)

నాయకుఁడు—(ఆశ్చర్యముతో)

పరుల కెవ్వరికీమె గన్పడఁగ నీని
కారణంబు తొలఁగినతత్క్షణమె యీమె
యొఱను వీడినస్వరశస్త్రితెఱఁగు దోఁప
స్వీయరూపంబుతోఁ బ్రకాశించునిపుడు. 12

సెబాసు! మే మనుసరించినవిధానము ఫలించినది. ఏలయన,

పంచబాణుని చరియించు వైజయంతి
తెఱఁగున, వెలయుకామాధిదేవతవలెఁ
గాయముధరించు లోకదృగ్భాగ్యరేఖ
వోలె నయనగోచర యయ్యె నీ లతాంగి. 13

(చాలసేపుపరికించి) ఈమె వాస్తవముగా స్త్రీమాత్రమే కాదు,

ననవిల్తునిలక్ష్మియో? మో
హనవిద్యాలసితరేఖ యగునో? సౌభా
గ్యనవీన కందలియో?

కింబహునా—

మమ లోచనభాగ్యదేవతైవేయమ్. ౧౪

(విచింత్య) జాత విస్రంభయో రనయోరహమాత్మానం దర్శయామి. (తథా కరోతి.)

[చంద్రలేఖా నాయకం విలోక్య సహర్షసంభ్రమం ప్రణమతి]

నాయకః — (సప్రసాదం) సఖి! కుశలమంతఃపురచారిణే జనాయ.

చంద్రలేఖా—అజ్జ దేవస్స విజయలచ్ఛీవల్లహస్స పఆరవింద దంసణేణ। (అద్య దేవస్య విజయలక్ష్మీవల్లభస్య పదార విందదర్శనేన)

కువలయావలీ—(విలోక్య స్వగతమ్) అహ్మహా సుందేరవిసేసో జఉదేవస్స (సానురాగం నిర్వర్ణ్య) అతిమేత్త సంమోహాణత్తణం ఆకిదివిసేసస్స. (అహ్మహా సౌందర్యవిశేషోయదు దేవస్య! అతిమాత్ర సమ్మోహనత్వ మాకృతివిశేషస్య) (ఇత్యవలోకయతి.)

చంద్రలేఖా—(ఆకూతమస్యాః పరిజ్ఞాయాత్మగతమ్) అహ్మహా ఇఅం భట్టారఅంమి అణురత్తళోఅణా సంవుత్తా. అహవా జుజ్జఇ ఖు చందమ్మిరాఓచందిఆఏ. (అహ్మహా! ఇయం భట్టారకేఽనురక్తలోచనా సంవృత్తా. అథవా యుజ్యతే ఖలు చంద్రేరాగశ్చంద్రికాయాః.)

కువలయావలీ—హాళా! ఏహి దేవీఏ సమీవం గచ్ఛామో. (హాలా! ఏహి దేవ్యాః సమీపం గచ్ఛావః.) (ఇతి సఖీ మాకర్షతి.)

పెక్కేల?—                    నా
కనుఁగవసిరివేల్పె యగును; గాదు మఱేదిన్. 14

(ఆలోచించి) ఈ యిరువురకు నిప్పుడు విశ్వాసముకలిగి నది; గనుక, వీరికింకఁగనఁబడెదను. (అని అట్లుసేయును)

[చంద్రలేఖ నాయకు నవలోకించి హర్షసంభ్రమములతో నమస్కరించును]

(చూ. అను. పాట 4)

నాయకుఁడు—(అనుగ్రహముతో) సఖీ! అంతఃపురచారిణులకుఁ గుశలమే కదా?

చంద్రలేఖ—విజయలక్ష్మీవల్లభులగు దేవరవారి పాదారవింద దర్శనముచే నిప్పుడు కుశలమే.

కువలయావళి—(చూచి, తనలో) ఓహో! యదుదేవుని సౌందర్యవిశేషము! (అనురాగముతో వీక్షించి) ఆకృతి విశేష మతిమాత్రసమ్మోహనముగా నున్నదే! (అని చూచు చుండును)

చంద్రలేఖ—(ఆమెయాకూతమును దెలిసికొనితనలో) ఓహో! ఈమె భట్టారకునియెడల ననురక్తలోచనయైనది. అవును. చంద్రునియెడలఁ జంద్రికకు రాగముదయించుట యోగ్య మే కదా?

కువలయావళి—సఖీ! రమ్ము. దేవిచెంతకుఁ బోవుదము. (అని సఖిని లాగును)

చంద్రలేఖా—హాళా! భట్టిణా అవిసజ్జిదా కహం గచ్ఛేమి తా విణ్ణవేహి భట్టారఅం. ఏసా విసజ్జీఅదు త్తి (హాలా! భర్త్రా అవిసర్జితా కథం గచ్ఛామి? తద్ విజ్ఞాపయ భట్టారకమ్, ఏషా విసృజ్యతామితి)

కువలయావలీ—(సకృత్రిమసంరంభం సఖీం విసృజ్య ద్విత్రీణి పదాని గత్వా పదస్ఖలితమభినీయ, ఆత్మగతమ్) అంహేహూ మజ్ఝచరణా ఇదోముహం ణప్పసరంతి। (పరివృత్య ప్రకాశమ్) హాళా! ణ విసుమరేహి ఏదం అవిణఅం। దేవీఏ విణ్ణవేమి। (అహో! మమచరణావితోముఖం నప్రసరతః. హాలా! నవిస్మరేతమవినయమ్. దేవ్యై విజ్ఞాపయామి)

చంద్రలేఖా—హాళా! ణ విసుమరేమి। తుమం గచ్ఛదావ। (హాలా! న విస్మరామి. త్వం గచ్ఛతావత్)

కువలయావలీ—హాళా! ఏహి (హాలా! ఏహి) (ఇతి సవినయం సఖీ మాకర్షతి)

నాయకః—(ఆత్మగతమ్)

క్షణవినయరోషపరిగతి
రకథితకథనేన సూచితాకూతా।
కన్యావిస్రంభకథా
కృతబద్ధం తత్ సుఖయతి స్వాంతమ్. ౧౫

(ప్రకాశమ్) చంద్రలేఖే! భవత్యో ర్మాధవశ్రీవిలోకనాంతరాయో మాభూత్। యతో వయమపసరామః।

చంద్రలేఖ—చెలీ! భర్తనుండి వీడుకోలులేక యెట్లు వెడలఁ గలను? 'ఈమెను విడువుఁడు' అని ప్రభువునకు విన్నవించు కొనుము.

కువలయావళి—(కృత్రిమసంరంభముతో సఖిని విడిచి రెండు మూఁడడుగులు పెట్టి చరణముల తొట్రుపాటభినయించి, తనలో) అయ్యో! చరణములుస్తంభించి మఱిముందునకుఁ బ్రసరింపకున్నవి.

(వెనుకకుఁ దిరిగి, ప్రకాశముగా) ఈయవినయమును మఱవకుము; దేవితో విన్నవించెదను.

చంద్రలేఖ—మఱఁనులెమ్ము; చెలీ! మఱి నీవు వెడలుము.

కువలయావళి—రమ్ము, చెలీ! రమ్ము. (అని సవినయముగాఁజెలిని లాగును)

నాయకుఁడు—(తనలో)

క్షణవినయదోషపరిగతస్వాంత; మాట
లాడకయె సూచితాకూతయైనకన్య
ప్రణయ విస్రంభ కథనాను బద్ధమయిన
నాదుస్వాంతంబు సౌఖ్యమొందంగఁ జేయు. 15.

(ప్రకాశముగా) చంద్రలేఖా! మాధవశోభావిలోకన మందు మీయిరువురకును విఘ్నముకలుగఁగూడదు; గావున, మేము తొలఁగిపోయెదము.

చంద్రలేఖా—(జనాంతికమ్) హళా! ఉజ్జాణంతరిదేణ భట్టిణా ఆలణ్ణిద పువ్వో ఏవ్వ అహ్మాణం వీసంభ సంవాదో। (హలా! ఉద్యానంతరితేన భర్త్రాకర్ణిత పూర్వ ఏవావాస్మాకం విస్రంభ సంవాదః)

కువలయావలీ—(సాసూయమ్) హళా! తుహ సిళిట్ఠవాదప్పఓఏణ అతిమేత్తం ళహూకఅం హ్మి. (హలా! తవశ్లిష్టవాద ప్రయోగే ణాతిమాత్రం లఘూకృతాస్మి)

చంద్రలేఖా—హళా! తుహ పరిక్ఖళిదవాదప్పఓవేణ అహం వి అతిమేత్తం ళహూకఅం హ్మి. (హలా! తవ పరిస్ఖలితవాద ప్రయోగేణాహమ ప్యతిమాత్రం లఘూకృతాస్మి)

[కువలయావలీ సవ్రీడస్మితంనమ్రముఖీ తిష్ఠతి]

[నేపథ్యే]

హళా! చందళేహే! కిఅచ్చిరం కువళఆవళిం వణసంచారేణ ఆఆసిదం కరేసి త్తి దేవీ కుప్పఇ। తా ఆణేహిణం. (హలా! చంద్రలేఖే! కియచ్చిరం కువలయావలీం వనసంచారేణాయాసితాం కరోషీతి దేవీ కుప్యతి. తదానయైనామ్.

[సర్వా ఆకర్ణయంతి]

చంద్రలేఖా—అణుజాణాదు దేవో అహ్మాగమణస్స. (అనుజానాతు దేవ ఆవయోర్గమనస్య)

నాయకః--భద్రే గమ్యతాం పునరాగమనాయ।

చంద్రలేఖ—(జనాంతికము) చెలీ! ప్రభువు మనకుఁ గనఁబడక పూర్వముద్యానమునందు డాఁగి మన రహస్యసంభాషణము వినియున్నవాఁడు సుమా.

కువలయావళి—(అసూయతో) నీశ్లిష్టపదప్రయోగముచేత నేను గడుఁజులుకనైతిని.

చంద్రలేఖ — నీపరిస్ఖలితపదప్రయోగముచేత నేనును జులుకనైతిని.

[కువలయావళి లజ్జాస్మితములతో
నమ్రముఖియై యుండును]

[నే ప థ్య ము న]

చెలీ! చంద్రలేఖా! ఎంతసేపు వనసంచారముచేఁ గువలయావళి నాయాసపఱచెదవని దేవి కోపించుచున్నది; కావున, నామెను దోడ్కొని రమ్ము.

[అందఱును వినుచుందురు]

చంద్రలేఖ—మేము వెడలుట కనుజ్ఞ దయసేయుఁడు.

నాయకుఁడు—మంచిది, మఱల వత్తురుగాక, పోయిరండు.

[ఉభే సభయ సంభ్రమం నిష్క్రాంతే]

నాయకః—(విలోక్య) కథమశాద్వలేఽపి బాలయవసాభిలాషీ లీలామృగః। (నిరూప్య) హంతేయం మరకతమణిముద్రికా? (గృహీత్వా నిర్వర్ణ్య సవిస్మయమ్) కథమత్ర మణేరంతరా ఛాయాచ్ఛలాదక్షర పంక్తిః।

కన్యాకరేణ మణిముద్రికయాంకితేన
పాంచాలికాభ్రమమియం విదధీత పుంసామ్।
ముద్రాపి యస్య భువి గచ్ఛతి దృశ్యభావ
మస్యాః కరగ్రహణమంగలమేష యాయాత్. ౧౬

ఇతి

(విచింత్య)

నూనమస్యాః ప్రభావేన
సా తథా వామలోచనా।
రత్నపాంచాలికాభ్రాంతి
మకరోన్మమ చక్షుషోః. ౧౭

నూనమేతదన్వేషణాయ సఖీసమేతా కువలయావళీ పునరిమం ప్రదేశమాయాస్యతి। తదిహైవ ముహూర్తమనాలక్షిత స్తామనుపాలయామి।

[ఇతి నిష్క్రాంతాః సర్వే]

॥ ప్రథమోఽంకః ॥

[ఇరువురును భయసంభ్రమములతో నిష్క్రమింతురు]

నాయకుఁడు—(చూచి) ఏమిది? పచ్చికలేనిచోటనుగూడ లీలా మృగము లేఁగసవున్నకై యభిలాషపడుచున్నదే! (పరికించి) ఓహో! ఇది మరకతమణి ముద్రిక! (చేతఁ దీసికొని, పరీక్షించి విస్మయముతో) ఏమి? ఈ మణిమధ్యమున నిచ్చోట ఛాయారూపమున నక్షరపంక్తి యున్నదే!

"కన్య మణి ముద్రికాంకిత కరముచేతఁ
బురుషులకు బొమ్మయనుభ్రాంతి వొడమఁజేయు;
నెవనికీ ముద్ర నేలపై దృష్టమగునొ
యతఁడె యీామెను బరిణయం బాడుగాక!". 16

అని యున్నది.
(ఆలోచించి)

నాకనుంగవ కావామనయన యపుడు
రత్నపాంచాలికయె యనుభ్రాంతి యటులఁ
బొడమఁజేయుట కీ మణి ముద్రికాప్ర
భావమే హేతువయినది వాస్తవముగ. 17

దీనిని వెదకుటకై కువలయావళి సఖితోఁగూడ మరల నిచ్చోటికిఁ దప్పకవచ్చును; గావున, నే నిచ్చటనే యొక ముహూర్తకాలము కనఁబడకుండ డాఁగి నిరీక్షించెదను.

[అందఱును నిష్క్రమింతురు]

ప్రథమాంకము సంపూర్ణము.

# అథ ద్వితీయోఽంకః

[తతః ప్రవిశతి విదూషకః]

**విదూషకః**—అహ్మో రహస్సోత్తి కహిదస్స పిఅవఅస్సాగ మణస్స రక్ఖణాదో మహ జఠరో నీసాసరోహేణేవ పూరిజ్జఇ. తా విఅణమ్మి ఇమస్సిం విళాసుజ్జాణే హాస్స పూరం కిం వి పరివాహఇస్సమ్. హీహీ! ణిజ్జిదం పిఅవ అస్సేణ. పరిణఅం అహ్మాణం భాఅహేఏణ! అజ్జ దీసఇ విళాసుజ్జాణ వాసమ్మి విఅఅళచ్ఛీ పిఅసహో వయస్సో! (ఇతి హర్షేణ నృత్యన్ సశంకం విరమ్య) అహ్మో మంత రక్ఖణే బుద్ధి ప్పమాదో మజ్ఝ. జం అంతేఉరపరిచారికా సంచరణజోగ్గే ఉజ్జాణమ్మి గోవణిజ్జం ఆఘోసేమ్హి। (విలోక్య) ఏసో ఖు పిఅవయస్సో ణం ఉపసప్పామి। (అహో! రహస్యమితి కథితస్య ప్రియవయస్యాగమనస్య రక్షణాన్మమ జఠరోనిఃశ్వాసరోధేనేవపూర్యతే. తద్ విజనేఽస్మిన్ విలాసోద్యానే హాస్యపూరం కిమపి పరివాహ యిష్యామి. హీహీ! నిర్జితం ప్రియవయస్యేన. పరిణత మస్మాకం భాగధేయేన. అద్య దృశ్యతే విలాసోద్యాన వాసే విజయలక్ష్మీప్రియసఖో వయస్యః. అహో! మంత్ర రక్షణే బుద్ధిప్రమాదో మమ. యదంతఃపుర పరి చారికా సంచరణ యోగ్య ఉద్యానే గోపనీయ మాఘోష యామి. ఏష ఖలు ప్రియవయస్యః ననూపసర్పామి.

# ద్వితీయాంకము

[విదూషకుఁడు ప్రవేశించును]

విదూషకుఁడు—అబ్బా! రహస్యమని చెప్పిన ప్రియవయస్యుని యాగమనవార్త దాఁచియుంచుటను నా కడుపునిశ్వాసనిరోధముచేతనువలె నుబ్బియున్నది. కావున, నిర్జనమయిన యీవిలాసోద్యానమునందు నాసంతోషపూరము కొంత వెల్వరించుకొనియెదను. వహ్వా! వహ్వా! నా ప్రియమిత్రుఁడు విజయముపొందెను. మాయదృష్టము పండినది. నేఁడు నావయస్యుఁడు విజయలక్ష్మీప్రియసఖుఁడయి విలాసోద్యానమునందలరుచున్నాఁడు. (అని సంతోషముతో గంతులువేయుచు జంకుతో నాఁగి) అయ్యో! రహస్యరక్షణమందు ఏమి నాబుద్ధిప్రమాదము! అంతఃపుర పరిచారికలు సంచారముచేయుటకు యోగ్యమయిన యీ యుద్యానమునందు గోపనీయమైన యీవిషయము చాటుచున్నాను. (చూచి) అదిగో! నా ప్రియమిత్రుఁడు! సమీపించెదను.

ప్రవిశ్య]

నాయకః—(ముద్రికాం నిర్వర్ణయన్)

తిరయసి యన్మధుర గిరో
లావణ్యం మదనరాజ్య ముద్రాయాః,
దురితేన తేన ముద్రే
స్వపద పరిభ్రంశ ముపగతా భవతీ. ౧

విదూషకః — (ఉపసృత్య) విఅఅలచ్ఛిపరిగ్గహేణ వడ్ఢఇ పిఅవఅస్సో। (విజయలక్ష్మీపరిగ్రహేణ వర్ధతే ప్రియవయస్యః)

నాయకః—(విలోక్య) సఖే! సుఖేన స్థీయతే?

విదూషకః—అజ్జ పిఅవఅస్సస్స ముహారవిందసందంసణేణ, అజ్జ మే సుదిణం జాదం। (అద్య ప్రియవయస్యస్య ముఖారవింద సందర్శనేన. అద్య మే సుదినం జాతమ్)

నాయకః—సఖే! శ్రీవత్స!

వరతనుమనిరీక్ష్య కన్యకాం
కుసుమశరాసవికాసదేవతామ్,
నయననయుగఫలం న లబ్ధవాన్
యదిహ విలంబ్య సమాగతో భవాన్. ౨

వత్సః—(సకౌతుకమ్) కిం ఏత్థ తుప విళోఇదా అజ్జ. (కిమత్ర త్వయా విలోకితాద్య?)

[ప్ర వే శిం చి]

నాయకుఁడు—(ముద్రికను వీక్షించుచు)

మదనసామ్రాజ్యముద్ర యామధురవాణి:
యామెలావణ్యసంపద నపుడు మఱఁగు
పఱచితివి ముద్ర! తత్పాపఫలముగా స్వ
పదపరిభ్రంశమిపుడు నీకొదవెఁ గాదె. 1

విదూషకుఁడు — (సమీపించి) విజయలక్ష్మీపరిగ్రహణముచేతఁ బ్రియవయస్యుఁడు వర్ధిల్లుచున్నాఁడు.

నాయకుఁడు—(చూచి) సఖుఁడా! సుఖముగా నున్నాఁడవా?

విదూషకుఁడు—ప్రియవయస్యుని ముఖారవిందసందర్శనముచే నేఁడు నాకు సుదినము.

నాయకుఁడు—మిత్రమా! శ్రీవత్సా!

పంచబాణ విలాస దేవతయు, సుంద
రాంగియునగునాకన్యఁ గానంగలేక
కన్నుఁగవగల్గుఫలమీవు గాంచవయితి
విటుల నీవాలసించి వచ్చుటను జేసి. 2

శ్రీవత్సుఁడు—(కౌతుకముతో) ఇప్పుడామె నీకెక్కడఁ గనఁబడినదా?

నాయకః—అథకిమ్? సఖే! కదాచిదపి విలోకయితా భవానితి యథానుభవమేవ తే నివేదయామి.

నితంబో బింబేన ప్రహసతి రథాంగం రతిపతేః
కరగ్రాహ్యా మధ్యస్త్రివలి పరిణద్ధో వరతనోః,
సమాక్రాంతో పాంతం కుచయుగల మాకీలితమివ
స్వభావాదాలోలే ప్రసృతిపరిమేయే చ నయనే. 3

శ్రీవత్సః—అహో ణిబ్బరత్తణం జోవ్వణస్స! (అహో నిర్భ రత్వం యౌవనస్య!)

నాయకః—సఖే నివేద్యతే ఖలు పరస్మై యత్తు జాత మస్పృష్ట పూర్వముపమానేన? తత్ ఖలు నిరవద్యం దుర్లభమ్.

పద్మం పంకనికేతనం కరికరావాబాల్యతః కర్క-శౌ
కాక్ష్యం వాయసశిక్షయా పరిగతాః పుంస్కోకిలానాం గిరః,
మీనానాం జడసంగతిః సితరుచేః సాపూర్ణితాపాతుకీ
తస్మన్యే తరలేక్షణా న లభతే స్వాంగోపమానం మనాక్. 4

శ్రీవత్సః—(స్వగతం) అహో బళిఅం ఖు అహిణివేసో ణవదం సణే జణే పిఅవఅస్సస్స, తా ఓసరం ణోదా ఇస్సం దావ. (ప్రకాశమ్) భో రాఅణో ణవప్పిఅ హోంతి త్తి దాణిం సచ్చో లోఅవాదో, జం తుమం సఅళగుణ సిళాహణిజ్జం దేవీజణం అవమణ్ణిఅ జం కం వి కణ్ణఅం అహిణందసి, అహావా పసిద్ధం ఖు ఏదమ్.

నాయకుఁడు — మఱేమి? మిత్రమా! నీవెప్పటికైన నామెను జూడకపోవుగదా యని నాయనుభవము ననుసరించియే తెలియఁ జేసెదను:—

తరుణినితంబ మాస్వరరథాంగముఁ గేరును బింబసంపదన్;
వరతను మధ్యమాత్రివళిబద్ధము, కేలగ్రహింపనొప్పు; బి
ట్టిరుగడలక్షసమాహృతవివృద్ధినిబద్ధము చన్నుఁదోయి; సుం
దరతరలోల్యశీలనయనంబులు చేరలఁ గొల్వఁగాఁ దగున్. 3

శ్రీవత్సుఁడు—ఓహో! ఏమి యాయౌవన పరిపూర్ణత!

నాయకుఁడు—మిత్రమా! అజ్ఞాతపూర్వమగు వస్తువు నితరులకుఁ దెలుపవలెనన్న నుపమానములచేఁ గదా తెలుపవలయును? గాని, యీమెవిషయమున నిర్దుష్టమగు నుపమానమే దుర్లభము.

సరసీజాతము పంకవర్తి; కరిహస్తంబుల్ శిశుత్వాదిగా
ఖరమైయుండుఁ;బికస్వరంబుకటువౌఁగాకంబుశిక్షల; సుధా
కరుపూర్ణత్వముపాక్షికంబు; జడసాంగత్యంబునల జికుటమీఁ;
లరయల లేదని యెంతు నీమెకెనయౌ స్వాంగోపమానం
బెటన్. 4

శ్రీవత్సుఁడు — (తనలో) ఓహో! నా ప్రియవయస్యునకుఁ గ్రొత్తగాఁ గనఁబడిన యాకన్నెయెడలఁ గలిగినయభినివేశము కడునధికముగా నున్నదిగావున, నేనందులకుఁ దగిన యవసరమీతనికిఁ జిక్కనీయను. (ప్రకాశముగా) ఔనయ్యా! రాజులు నవప్రియులను లోకోక్తి యిప్పుడు, సత్యమయినది. ఏమందువేని, సకలగుణశ్లాఘనీయమయిన దేవీజనము నాద

అణ్ణస్సిం వసఇ గుణో
పహూాణ చిత్తం ఖు రమఇ అణ్ణస్సిం,
కమలే ఖండిఅ పేమ్మా
చందో కుముదం పసాఏది. ౫

(ఆహో బలవాన్ ఖల్వభినివేశో నవ దర్శనే జనే ప్రియవయస్యస్య! తదవసరం న దాస్యామి తావత్. భోః! రాజానో నవప్రియా భవంతీతీదానీం సత్యో లోకవాదః. యత్త్వం సకలగుణశ్లాఘనీయం దేవీజనమవమత్య యాం కామపి కన్యకామభినందసి. అథవా ప్రసిద్ధం ఖల్వేతత్:
అన్యస్మిన్ వసతి గుణః ప్రభూణాంచిత్తం ఖలు రమతేఽ-
[న్యస్మిన్ ।
కమలే ఖండితప్రేమా చంద్రః కుముదం ప్రసాదయతి.)

నాయకః—సఖే! వస్తుగుణవిశేషో వివేకినాం సౌహార్దముత్పాదయతి.

శ్రీవత్సః—తుజ్ఝ కామం ణీదో వివేఓ పురాణ మళసేఅ పింఛిళ చిఉరబంధేసు ఘోసకుళ పురంధిఅణేసు చోరిఅ రఆహిళాసేణ జాణిదో ఏవ్వ. (తవ కామం నీతో వివేకః పురాణ మలసేక పిచ్ఛిల చికుర బంధేషు ఘోషకుల పురంధ్రీ జనేషు చౌర్యరతాభిలాషేణ జ్ఞాతఏవ.)

రింపక యెవతెనో యొకకన్య నభినందించుచున్నావు. ఔనిది సుప్రసిద్ధమేకదా?

ఒక్కచోటను సద్గుణ మొప్పుచుండ
నన్యమగుచోటఁ బ్రభుచిత్త మలరుచుండు
విమల కమలానురాగంబు విడిచివిధువు
కుముదమునకుఁ బ్రసన్నుఁడై కూర్చుఁగాదె. 5

నాయకుఁడు — మిత్రమా! వివేకులకు వస్తుగుణవిశేషము సౌహార్ద మొదవించును.

శ్రీవత్సుఁడు — కామంగామియైన నీవివేకము జిడ్డుతలకొప్పులుగల యాగొల్లపడచులయెడలఁ గలిగిన చౌర్యరతాభిలాషమునుబట్టి తెల్లమైనదే కదా?

నాయకః—సఖ! తవాయం కిమాశయః, యదియ మస్త స్తనో రథ భూరాభిరూప్యేణ న దేవీజనస్య తుల్యేతి?

శ్రీవత్సః—తహ ఏవ్వ, జహ పిఅవఅస్సో వక్ఖాణం కరేఇ.
(తథైవ. యథాప్రియవయస్యో వ్యాఖ్యానం కరోతి)

నాయకః—సర్వాతిశాయి తస్యా లావణ్య మసాకూత్ కుర్వతో భవతో యదుచితం తదభిదధాసి. కిం బహునా? శ్రూయ తామ్—

విలోల భ్రూవీచేర్విచలిత కటాక్షోత్పలవనాత్
కనద్ గ్రీవాకంబోః కుచయుగలచక్రాంకమిథునాత్,
లతాంగ్యా లావణ్యాదమృతసరసః కైరపి కణైః
వికీర్ణైరన్యాసాం రుచిమకృత ధాతేతి కలయే. ౬

శ్రీవత్సః—(సప్రత్యయాదరమ్)
భద్దస్సహస్సఅంతే
ఉరపఇణో తుజ్ఝ హరఇ జా చిత్తం,
సా ఇళ ళళణారఅణం
అణగ్ఘం ఖు హోఇ మాణిక్కమ్.
అహ సే తుమం ఉద్దిసిఅ కీరిసో దిట్ఠివిసేసో.

(భద్రసహస్రాంతఃపురపతేస్తవ హరతి యాచిత్తమ్,
సా (కిల) లలనారత్నమనర్ఘం ఖలుభవతి మాణిక్యమ్.
అథ తస్యాస్త్వాముద్దిస్య కీదృశో దృష్టివిశేషః?)

నాయకుఁడు—మిత్రమా! ఏమి? నా మనోరథమునకు నెల వయిన యా కన్య రూపసంపత్తిని దేవీజనమునకు సాటి రాదనియా నీ యభిప్రాయము?

శ్రీవత్సుఁడు—ఔను; ప్రియవయస్యుఁడు వ్యాఖ్యానించినట్లే.

నాయకుఁడు—అన్నిటి నతిశయించినయామె లావణ్యమును బరికింపనివాఁడవుగనుక, నీ కుచితమైనది నీవు పలుకుచున్నావు. పెక్కుమాటలేల? వినుము.

చలిత భ్రూయుగభంగసంచయము, నాచంచత్ కటాక్షో [త్పలం,
బలరున్ గంఠదరం, బురోజయుగచక్రాంగంబునై యొప్పు [నీ యంగనో
జ్జ్వలలావణ్యసుధాసరస్సు విడి చిందన్ బిందువుల్ గొన్ని [టిన్
గలయన్ గూర్చి విరించి యన్యలరుచిన్ గావించె నం చెంచెదన్. 6.

శ్రీవత్సుఁడు—(ప్రత్యయాదరములతో)

అనఘ సహస్రాంతఃపుర
జనమనముల నపహరించు చతురుఁడవగు నీ
మనమపహరించు లలనా
మణి వాస్తవముగ ననర్ఘమాణిక్య మగున్. 7

అయిన నామెకు నీయెడలఁగల దృష్టివిశేష మెట్టిదో?

నాయకః—

అభిలాషో వామాక్ష్యోః
ప్రదీప ఇవ యవనికాప్రకాశాభ్యామ్,
మందాక్ష మన్మథాభ్యాం
న చ ప్రతీతో న చాప్రతీతశ్చ. ౮

తదానీం ఖలు

ప్రత్యాలోకనలాలసైరపి సఖే మందాక్షమందీకృతైః
సవ్యాజం ప్రతిసారితైరపి పరం కాతర్యపర్యాకులైః,
సంవాదే పరివర్తితై రనుపదం గాంభీర్యసంప్రేక్షితైః
విక్రీతోఽస్మి విలోకితై ర్వరతనో రాకూతకర్ణేజపైః.

శ్రీవత్సః—భో వఅస్స! ఏఆరిసో అహిళాసో। ఇదోపరం సా తుఏ కిం ఉవేక్ఖిదవ్వా? (భోవయస్య! ఏతాదృశోఽభిలాషః ఇతః పరం సాత్వయా కి ముపేక్షితవ్యా?)

నాయకః—సా కిల భగవతా నారదేన పరిన్యాసీకృతా, విదర్భ రాజనందనాయా వశే వర్తతే.

శ్రీవత్సః—తా తుజ్ఝ ఏసమ్మి అహిళాసో పణ్ణగీఏ ఫణార అణాహిళాసో వ్వ దుల్లహో త్తి తక్కేమి. (తత్ తవైతస్యా మభిలాషః పన్నగ్యాః ఫణారత్నాభిలాష ఇవ దుర్లభ ఇతి తర్కయామి.)

నాయకుఁడు—

ఆమనోహారి యభిలాష మప్పు డచ్చట
యవనికా ప్రకాశంబులం దమరు దీప
మట్లు మందాత్మకామంబులందు దవిలి
ప్రకటితాప్రకటితముగ వఱలుచుండె. 8

ఆ సమయమందు,

మాఱుచూడ్కులు నిగుడింప మరలుగొన్న
వయ్యు మందాత్మమందంబు లగుచు, నెదియొ
వ్యాజమునఁ బ్రతిసారితావస్థఁ గనియు
భీతిపర్యాకులంబులై వెలయుచుండి
ప్రణయసంవాదమందు మరలుచు ననుప
దంబు గాంభీర్యసంప్రేషితంబు లగుచు
నామె భావంబుఁ జెవినూఁదునవియుఁ బోలెఁ
దెలిపి కలికిచూడ్కులు నన్ను విలిచికొనియె. 9

శ్రీవత్సుఁడు—నీకింత యభిలాష మున్నదిగదా; యామె నింకను నీవుపేక్షింపనేల?

నాయకుఁడు—నారదమహర్షి యిల్లడవెట్టుటచేత నామె యా రుక్మిణివశమందున్నది.

శ్రీవత్సుఁడు—అట్లయినచో నీకామెపైఁగల యభిలాషము పాముపడగనున్న మాణిక్యముపైఁగల యభిలాషమువలె దుర్లభమని తలంతును.

నాయకః—(సనిఃశ్వాసమ్) సఖే! శ్రీవత్స! తావ దాస్తామన వధేః సుకృతశేవధేః పరిణామస్తావానభిలాషః. కింతు.

సకృదపి పునరక్ష్ణో ర్ద్వారి కిం సన్నికర్షే
ప్రణయపిశుననానాభావ సంభేదరమ్యామ్,
శివ శివ యది తస్యా వక్త్రమాలోకయేయం
స హి మమ సుకృతానాం సంచితానాం విపాకః. ౧౦

[తతః ప్రవిశతి పటాక్షేపేణ కువలయావలీ చంద్రలేఖా చ]

చంద్రలేఖా—హళా! మందబుద్ధీఏ భంసిదా మణిముద్దిఆ ఆసణ్ణ సంచారిణో భట్టిణో దంసణపహే పడిస్సది । అహవా అణ్ణస్స వేత్తి ఆఉళహ్మి. (హలా! మందబుద్ధ్యా భ్రంశితా మణిముద్రికాసన్నసంచారిణో భర్తుర్దర్శనపథే పతిష్యతి. అథవాన్యస్య వేత్యాకులాస్మి.)

కువలయావలీ—(ఆత్మగతమ్) కుదో తారిసం భాఅహేఅం కువలఆవళీఏ । జేణ సో మహాణుభాఓ మణిముద్దిఅం పుళఇ । (ప్రకాశమ్) హళా! తా తువరిదం గదుఅ అణ్ణేసామో. (కుతస్తాదృశం భాగధేయం కువలయావల్యాః? యేన స మహానుభావో మణిముద్రికాం పశ్యతి. హలా! తత్ త్వరితం గత్వాన్విష్యావః.)

[ఇతి పరిక్రామతః]

శ్రీవత్సః—భో వఅస్స! తూణ్హీం చిట్ఠ । ఏసో ఖు విస్సంభగోట్ఠీణిళఅస్స దుట్ఠదాసీపుత్తళస్స సల్లావోవిఅ సుణీఅది. (భోవయస్య! తూష్ణీం తిష్ఠ. ఏషఖలు విస్రంభ

నాయకుఁడు—(నిట్టూర్పుతో) మిత్రమా! శ్రీవత్సా! నిరవధిక పుణ్యనిధికిఁ బరిణామమగునంతటి యీయభిలాష మటుండ నిమ్ము; కాని,

ప్రణయసూచక బహుభావరమ్యముగుచుఁ
గన్నులకుఁ బండువైన యాకన్నెమొగముఁ
జేరువగ నిల్చి మరల దర్శింతునేని
బళిబళీ మత్పురాపుణ్యఫలము గాదె? 10

[అప్పుడు తెర తొలఁగించుకొని కువలయావళియుఁ జంద్రలేఖయుఁ బ్రవేశింతురు]

చంద్రలేఖ—చెలీ! మందబుద్ధివలన జాఱిపోయిన మణిముద్రిక యీ సమీపమందు సంచరించుచున్న ప్రభువుదర్శనపథ మందేపడియుండవచ్చు. అట్లుగాక, యన్యులకంటఁ బడునేమో యని వ్యాకులితనగుచున్నాను.

కువలయావళి—(తనలో) ఆ మహానుభావుఁడు మణిముద్రికను జూచునంతటి యదృష్టమీకువలయావళి కెక్కడిది? (ప్రకాశముగా) త్వరితముగాఁ బోయి వెదకుదము రమ్ము. (అని పరిక్రమింతురు)

శ్రీవత్సుఁడు—ఓ వయస్యా! ఊరకుండుము. విస్రంభగోష్ఠికి నిలయమయిన దుష్టదాసీపుత్రునిసల్లాపమువలె నేదో విన వచ్చుచున్నది.

గోష్ఠీనిలయస్య దుష్టదాసీ పుత్రకస్య సల్లాప ఇవ శ్రూయతే.)

నాయకః—నూనమియం మణిముద్రికాన్వేషణాయ సమాగతా సవయస్యా కువలయావలీ భవిష్యతి । సఖే! నికుంజపుంజ పిహితావాలోకయావః. (తథా కురుతః)

శ్రీవత్సః—కా వా మణిముద్దిఆ । కిం వా సమణ్ణేసంతిత్తి ణ ఆణామి. (కావా మణి ముద్రికా, కిం వా సమన్విష్యంతీతి న జానామి.)

నాయకః—సఖే! కువలయావల్యా మణిముద్రికా కేనాపి హేతునా పరిభ్రష్టా మయా దృష్టా (ఇతి మణిముద్రికాం దర్శయతి)

శ్రీవత్సః—(నిర్వర్ణ్య) వఅస్స! కుదో ఏత్థ మణిముద్దిఆ? (వయస్య కుతోఽత్రమణి ముద్రికా?)

నాయకః—(స్వగతమ్) అహో సామర్థ్యమచింతనీయం తపో విశేషస్య! యేనాయం మయా దర్శితామపి ముద్రికాం న పశ్యతి. (ప్రకాశమ్) విదితమధునా తవ బ్రాహ్మణ్య మస్మాభిః. యదియమనధీతసంధ్యావిధినా న లక్ష్యతే ముద్రికేతి లిఖితమత్రైవ.

శ్రీవత్సః—కేణేదం అహిలిహిదం. (కేనేద మభిలిఖితమ్?)

నాయకః—సఖే! బ్రహ్మర్షిణా నారదేన.

శ్రీవత్సః—భో! మహారాఅ! తుమం విణా కో అణ్ణో వీణాగా అకస్స తస్స బంహ్మాబంధుణో వఅణం పమాణం కరిఅ సిరివస్సం అహిక్ఖివది. (భో! మహారాజ! త్వాంవినా కోఽన్యో

నాయకుఁడు—ఇది తప్పక మణిముద్రికాన్వేషణమునకై తన చెలితో వచ్చిన కువలయావళియే కావలయును. మిత్రమా! మన మీ నికుంజమున దాఁగి యవలోకింతము రమ్ము. (అని యట్లు సేయుదురు)

శ్రీవత్సుఁడు—మణిముద్రికయేమి? దాని నన్వేషించుట యేమి? నాకేమియుఁ దెలియకున్నది.

నాయకుఁడు—మిత్రమా! కువలయావళి మణిముద్రిక యేకారణముననో జాఱి నేలరాలినది. నాకంటఁ బడినది. (అని ముద్రికను జూపును)

శ్రీవత్సుఁడు—(పరికించి) వయస్యా! ఏదీ? మణిముద్రిక యిచ్చటెక్కడ?

నాయకుఁడు—(తనలో) ఓహో! తపోవిశేషసామర్థ్యమచింతనీయము గదా! నేను జూపించుచున్నను వీనికీ ముద్రిక కనఁబడకున్నది. (ప్రకాశముగా) నీబ్రాహ్మణ్యమిప్పుడు మాకుఁ దెలిసినది. సంధ్యావందనమయినను నేర్వనివానికీ ముద్రిక గోచరముకాదని దీనిమీఁదనే లిఖితమై యున్నది.

శ్రీవత్సుఁడు—ఎవనిచేత?

నాయకుఁడు—బ్రహ్మర్షియగు నారదునిచేత.

శ్రీవత్సుఁడు—వీణాగాయకుఁడైన యా బ్రహ్మబంధునివచనము ప్రమాణముగాఁ గైకొని యీ శ్రీవత్సుని నీవధిక్షేపించితివి గాని, యన్యుఁడెవఁడట్లు చేయఁగలఁడు?

వీణా గాయకస్యతస్య బ్రహ్మబంధోర్వచనం ప్రమాణం కృత్వా శ్రీవత్సమధిక్షిపతి.)

నాయకః—అనయైవ నివేద్యతే తత్రభవతో భవతశ్చ శక్తి తారతమ్యమ్ ।

శ్రీవత్సః—అహ్హో తుజ్ఝ వఅస్సస్స సత్తితారతమ్మపరిణ్ణాణం। జం తుహ పసావేణ పచ్చూసమ్మి సాఅం అ అమిఅ సక్కరఖండమోదఅసదం ఖాదంతో సిరివచ్ఛో సత్తిహీణో। సో ఉణ కందమూళఫలాసణో ణారదో సత్తిమంతోత్తి ఆళ విజ్జఇ। (ససంరంభం వామ ముష్టిముద్యమ్య) భో మహారా అ! తం సత్తిమంతం ఇహాణేహి సిగ్ఘం। మహ ఏక్క ముట్ఠిణా మహేసిం మహిమ్మి పాడఇస్సం। అణ్ణవా ఇమం జణ్ణసుత్తం ఛిణ్ణం కాఊణ పరిక్ఖివామి। (ఇతి యజ్ఞసూత్ర స్థానం పరామృశన్ సవిషాదమాత్మగతమ్) హరిసణచ్చణావ సరే ఏవ్వ ఛిణ్ణం భిణ్ణం జణ్ణసుత్తం। తా అణ్ణదో పసంగం కరేమి। (విలోక్య) భో! ఏసా ఖు చందలేహా। కా ఉణ ఇఅం అణ్ణతరా। (విచింత్య) భో! మవ పరిణ్ణాదం। కువి దం మం అణుణేదుం విళాసవణదేవదా సఅం ఏఇ। అహవా తుమం జఅళచ్ఛిసహిదం అహిణందిదుం ఏవ్వ ఏఇ. (అహ్హో! తవ వయస్యస్య శక్తితారతమ్య పరిజ్ఞానమ్! యత్తవ ప్రసాదేన ప్రత్యూషే సాయం చామిత శర్కరాఖండమోదక శతం ఖాదన్ శ్రీవత్సః శక్తిహీనః; స పునః కందమూలఫలాశనో నారదః శక్తిమానిత్యాలప్యతే. భో! మహారాజ! తం శక్తిమంత మిహానయ శీఘ్రం. మమైక ముష్టినా మహర్షిం మహ్యాం పాతయామి. అన్యథేదం యజ్ఞసూత్రం ఛిన్నం కృత్వాపరిక్షిపామి...హర్షనర్తనావ

నాయకుఁడు—దీనిని బట్టియే పూజ్యుఁడయిన యానారదుని శక్తికిని నీ శక్తికిని గల తారతమ్యము తెలియవచ్చినది.

శ్రీవత్సుఁడు—ఓహో! వయస్యా! ఏమి నీకుఁగల శక్తి తారతమ్య జ్ఞానము! నీయనుగ్రహముచేత నుదయమునను సాయంకాలమునను శర్కరాఖండమోదకశత మమితముగా తినుచున్న శ్రీవత్సుఁడు శక్తిహీనుఁడనియుఁ గందమూలఫలములను దినుచున్న నారదుఁడేమో శక్తిమంతుఁడనియుఁ బల్కుచున్నావు గదా. (సంరంభముతో నెడమపిడికిలి నెత్తి). ఓ మహారాజా! ఆశక్తిమంతు నిచటికి శీఘ్రముగాఁ దీసికొని రమ్ము. ఈ యొక్క ముష్టిప్రహారముతో నేనామహర్షిని నేలఁ బడవైచెదను. అట్లు సేయలేనియెడల నిదిగో నా యజ్ఞోపవీతమును ద్రెంపి పాఱవైచెదను (అని యజ్ఞోపవీతముండు స్థలమును దడవుకొనుచు విషాదముతోఁ దనలో) నా యజ్ఞోపవీతము సంతోషముతో నేను దాండవించు సమయమందే తెగి జాఱిపోయియుండును; గనుక, మఱియొక ప్రసంగము గావించెదను. (చూచి) అదిగో! మిత్రమా! ఆమె యేమో చంద్రలేఖ మఱియారెండవదియెవరు? (ఆలోచించి) ఓహో! నాకుఁ దెలిసినది. విలాసవనదేవత కుపితుఁడనయిన నన్ననునయించుటకుఁ దనంతఁ దానే వచ్చుచున్నది. కాదు; విజయలక్ష్మీసమేతుఁడవైన నిన్నభినందించుటకు వచ్చుచున్నది.

సర ఏవ ఛిన్నంభిన్నం యజ్ఞసూత్రం. తదన్యతః ప్రసంగం కరోమి. భోః! ఏషా ఖలు చంద్రలేఖా. కాపునరియ మన్యతరా? భో! మయా పరిజ్ఞాతమ్. కుపితం మామను నేతుం విలాసవనదేవతా స్వయమేతి. అథవా త్వాం జయలక్ష్మీసహిత మభినందితుమేవైతి.)

నాయకః—(సస్మితమ్) సఖే సేయం మయా కథితా కువలయావళీ నామ। న పునర్వనదేవతా।

శ్రీవత్సః—అచ్చరిఅం అచ్చరిఅం। అపువ్వా ఈరిసీసోభగ్గ లచ్ఛీ మాణుసీసు। వఅస్స! ఠాణే ఖు దే దిట్ఠీ సజ్జఇ. (ఆశ్చర్యమాశ్చర్యమ్! అపూర్వేదృశీ సౌభాగ్యలక్ష్మీర్మానుషీషు. వయస్య! స్థానేఖలు తే దృష్టిః సజ్జతే)

చంద్రలేఖా—(అభితో విచిత్య సవిషాదమ్) హళా! ణ దీసఇ ముద్దిఆ। కిం కరేహ్మి. (హలా! న దృశ్యతే ముద్రికా కిం కుర్వః?)

కువలయావళీ—(అశ్రు తిమభినీయ ఆత్మగతమ్) అఇచిత్త! తుమం సహీఏ ఆసంకిదమేత్తేణేవ్వ కింత్తి అప్పాణం కిదత్థం చింతేసి. (అయిచిత్త! త్వం సఖ్యా ఆశంకిత మాత్రేణైవ కిమిత్యాత్మానం కృతార్థం చింతయసి?)

చంద్రలేఖా—(ఆత్మగతమ్) కహం ఏసా అణ్ణచిత్తా ణ మే వఅణం అహిమణ్ణేఇ। (ప్రకాశమ్) హళా ణం భణామి ఏత్థ రఅణాళంకారో ణ దీసఇ త్తి. (కథమేషాన్య చిత్తా న మే వచన మభిమన్యతే? హలా! నను భణామ్యత్ర రత్నాలంకారో న దృశ్యత ఇతి.)

కువలయావళీ—ణ కేవళం రఅణాళంకారో. (న కేవలం రత్నాలంకారః.)

నాయకుఁడు—(మందహాసముతో) మిత్రమా! ఈమెయే నేను జెప్పిన యాకువలయావళి. అంతియేకాని, వనదేవత కాదు.

శ్రీవత్సుఁడు—ఆశ్చర్యమాశ్చర్యము! ఈ సౌభాగ్యలక్ష్మి మనుష్య స్త్రీలయం దపూర్వ. చెలికాఁడా! నీదృష్టి తగినతావుననే సక్తమయినది!

చంద్రలేఖ—(అన్నివైపుల నరసి విషాదముతో) చెలీ! ముద్రిక కనఁబడకున్నది. ఏమిసేయుదము?

కువలయావళి—(విననియట్లభినయించి, తనలో) చిత్తమా! నా చెలి యాశంకించినంతమాత్రముననే నీవు కృతార్థమైతివని యనుకొనుచున్నావా?

చంద్రలేఖ—(తనలో) ఏమి! ఈమె యన్యచిత్తయై నామాట వినిపించుకొనుటయే లేదు. (ప్రకాశముగా) చెలీ! రత్నాలంకార మిచట కనఁబడుట లేదనుచున్నాను.

కువలయావళి—రత్నాలంకారమొక్కటియే కాదు.

చంద్రలేఖా—కిం ఉణ అణ్ణం? (కిం పున రన్యత్)

కువలయావలీ—(ఆత్మగతమ్) అంహో చిత్తస్స మే అధీరత్తణం! జం రఅణగబ్భాళంకారో సో వి మహాభాఓ ణ దీసఇ త్తి ఆఢఉత్తమ్హి। హోదు ఏవ్వం దావ. (ప్రకాశమ్) హళా రఅణాళంకారహారిణో జణస్స చరణవిణ్ణాసో వి ణ దీసఇ (అహో చిత్తస్యమే అధీరత్వం! యద్రత్నగర్భాలంకారః సోఽపి మహాభాగో న దృశ్యత ఇత్యారబ్ధాస్మి. భవతు ఏవం తావత్. హలా! రత్నాలంకారహారిణో జనస్య చరణవిన్యాసోఽపి న దృశ్యతే.)

చంద్రలేఖా—భట్టిణో ఏవ్వ చరణవిణ్ణాసో దీసఇ ణ ఉణ అణ్ణస్స జణస్స. (భర్తురేవ చరణవిన్యాసోదృశ్యతే నపునరన్యస్య జనస్య).

కువలయావలీ—(సనర్మ స్మితమ్) హళా! జుజ్జఇ ఇమస్సిం తుహ ఆసంకా। జం సో కిళ కాళిందీజళవిహారిణీణం వల్లవణిఅంబిణీణం అంబరచోరో త్తి సుణీఅది. (హలా! యుజ్యతేఽస్మిన్ తవాశంకా యత్ స కిల కాలిందీజలవిహారిణీనాం వల్లవ నితంబినీనామంబరచోర ఇతి శ్రూయతే.)

నాయకః—సఖే! లబ్ధావసరోఽస్మీతి ప్రకాశో భవితు మిచ్ఛామి.

శ్రీవత్సః—ఖండమోదఏ హత్థగదే కిం జీహాణిఅంతణేణ. (ఖండమోదకే హస్తగతే కిం జిహ్వానియంత్రణేన?)

చంద్రలేఖ—ఇంక మఱియేది?

కువలయావళి—(తనలో) అయ్యో! నాచిత్తదౌర్బల్యము! రత్న గర్భాలంకారుఁడయిన యీ మహాభాగుఁడును గనఁబడుట లేదనఁబోవుచున్నాను! అట్లే కానిమ్ము. (ప్రకాశముగా) చెలీ! రత్నాలంకారహారియైన యీతని యడుగుజాడ యైనను గనఁబడుటలేదు.

చంద్రలేఖ—భర్తృ చరణవిన్యాసము కనఁబడుచున్నది; గాని మఱి యితరుని యడుగుజాడ కనఁబడుట లేదు.

కువలయావళి—(నర్మస్మితము) చెలీ! అతనియెడల నీకాశంక గలుగుట సరియైనదే. ఏలయన, నతఁడు కాళిందీజల విహారము సేయుచుండిన వల్లవనితంబినులకోకల నపహరించిన దొంగయని విందుముగదా?

(చూ. అను. పాట 5)

నాయకుఁడు—నాకుఁ దగినయవకాశము దొరికినది; యెదుటఁ బడియెదను.

శ్రీవత్సుఁడు—ఖండమోదకము చేతికిఁజిక్కినప్పుడు నాలుక నింకను నిగ్రహింపనేల? (ఇరువురును సమీపింతురు)

[ఉభావుపసర్పతః]

నాయకః—

పద్భ్యాం పద్మరుచిం నిషంగసుషమాం జంఘాశ్రియా ధూన్వతీ,
మూరుభ్యాం కదళీప్రభామురసిజ ద్వంద్వేన కుంభశ్రియమ్,
పూర్ణేందు ద్యుతిమాననేన విదితం ముగ్ధే! స్వయం ముష్ణతీం,
మామేవం విపరీతభాషిణి! వృథా పాటచ్చరం భాషసే. ౧౧

అథవా చోరో భవామి తావదహమ్.

చోరస్యాపి ధనం హస్తే
హరన్తి కుటిలేక్షణే
చౌర్యవిద్యావిశేషేణ
మామతిక్రమ్య వర్తసే. ౧౨

పశ్య,

ఊరుభ్యాం కరభోరు! చోరయసి మే కామోదకీ విభ్రమం
నాభిస్తే నతనాభి! చక్రసుషమామాక్రామతి చ్ఛద్మనా,
కంఠస్తే కలకంఠి! వంచయతి మే తాం పాంచజన్యప్రభాం
చారు భ్రూలతయా చకోరనయనే! ముష్ణాసి శార్ఙ్గశ్రియమ్.
౧౩

కువలయావలీ—(సలజ్జాసాధ్వసం సఖీమంతర్ధాయ, ఆత్మగతమ్) అహో! పురుషోత్తమస్స సమాళావచాతురీ, (జనాంతికమ్) హాళా! ణివారేహి ణం పసంగంతరేణ. (అహో! పురుషోత్తమస్య సమాలాపచాతురీ, హలా! నివారయైనం ప్రసంగాంతరేణ)

నాయకుఁడు—

చరణములన్ సరోజరుచి, జంఘులకల్మి నిషంగశోభ, న
య్యరఁటి వికాస మూరువుల, హారికుచద్వయిఁ గుంభ
[లక్ష్మియున్,
నెరనెల దీప్తి నాస్యమున, నీవుహరించి యకారణంబ యీ
వరుసను నన్ను దొంగయని పలుకుదువే? విపరీత భాషిణీ! 11

దొంగనే యగుదునుగాక,
చోరకుని చేతి ధనమును జూఱకొనుచు
నున్న దానవు గావున నన్నుఁగూడఁ
జౌర్యవిద్యా విశేష కౌశలము నందు
మించి వర్తించు దానవో చంచలాక్షి! 12

చూడుము—

కరభోరూ! భవదూరు యుగ్మమున మత్కాంతోదకీ శోభఁ,
[ద్వ
ద్వరనాభిన్ నతనాభి! చక్రసుషమన్, ద్వత్కంఠ భాగంబునన్
దరకంఠీ! వరపాంచ జన్యరుచియున్, ద్వద్భ్రూలతన్
[దివ్య శా
ర్ఙరమా వైభవమో చకోరనయనా! కైకొంటి చౌర్యంబునన్.

కువలయావళి—(లజ్జా భయములతోఁ జెలి చాటున డాఁగి) ఓహో! పురుషోత్తముని సమాలాప చాతురి! (జనాంతికముగా) చెలీ! మఱియొక ప్రసంగముచే నీతని నివారింపుము.

చంద్రలేఖా—భట్టారఅ! ఏసా ఇదం విణ్ణవేది, తారిసీవ మహా అంతరంగం చోరేంతో మహారాఓ ఏక్కో-సరిసో చోరోత్తి. (భట్టారక! ఏషేదం విజ్ఞాపయతి తాదృశ్యా మమాంత రంగం చోరయన్ మహారాజ ఏకః సదృశశ్చోర ఇతి.)

కువలయావలీ—అవేహి దుల్లళిదే! అవేహి, అవ అకహిదం కహేసి. (ఇతి సఖీమధిక్షిప్య పరాఙ్ముఖీ తిష్ఠతి.) (అపేహి దుర్లలితే! అపేహి. అయే! అకథితం కథయసి.)

శ్రీవత్సః—చందలేహే! అంతరంగచోరత్తణం సమాణం ఏవ్వ దోణం ఏదాణం. (చంద్రలేఖే! అంతరంగచోరత్వం సమానమేవ ద్వయోరేతయోః.)

చంద్రలేఖా—అహిఅం ఖు ముద్దిఆహారణం తుహ్మేసు. (అధికం ఖలు ముద్రికా హారణం యుష్మాసు)

కువలయావలీ—(సప్రసాదస్మితం సఖీమవలోకయతి.)

నాయకః — (నాయికాయాః, పురో, భూత్వా) యదీయం త్వదీయా స్వర్ణవిన్యాసా ముద్రికా తదాదీయతామ్.

(ఇతి స్వకరస్థితాం ముద్రికాం దర్శయతి).

నాయికా — (విలోక్య సహర్షమాత్మగతమ్.) అహిళిహిదక్ఖరా ముద్దిఆ ఉవళద్ధా మహాభాఏణ । (హృదయ ముద్దిశ్య) అఇహిఅఅ! దాణిం మణోరహో తుహ ఈరిసో అంకు రిదో । (ముద్రికామాదాతు మిచ్ఛతి । కరాగ్రకంపమభినీయ జనాంతికమ్) హళా! వేవఇ మే అగ్గహత్థో । తా తుమం గేహ్ణ ఏదం. (అభిలిఖితాక్షరాముద్రికోపలబ్ధా మహా భాగేన. అయిహృదయ! ఇదానీం మనోరథస్తవేదృశోంఽ

చంద్రలేఖ—భట్టారకా! ఈమె యిట్లు విన్నవించుకొనుచున్నది. అట్టి నా యంతరంగమును దొంగిలించుచున్న మహారాజొక్కఁడే తగిన చోరుఁడని.

కువలయావళి—పొమ్ము; దుర్లలితా! పొమ్ము. నేను జెప్పనిది చెప్పుచున్నావు. (అని సఖినధిక్షేపించి పరాఙ్ముఖియై యుండును.)

శ్రీవత్సుఁడు—చంద్రలేఖా! అంతరంగ చోరత్వ మీ యిరువురకును సమానమే.

చంద్రలేఖ—కాని, ముద్రికాపహరణము మాత్రము మీ యందధికము.

కువలయావళి—(ప్రసాదస్మితముతోఁ దన సఖిని జూచును.)

నాయకుఁడు—(నాయిక యెదుటనిలిచి) స్వర్ణవిన్యాసముగల యీ ముద్రిక నీదే యయినయెడలఁ దీసికొనుము.

(అని తన చేతనున్న ముద్రికను జూపును)

నాయిక—(చూచి, సంతోషముతోఁ దనలో) అభిలిఖితాక్షరయగు నీ ముద్రిక యీ మహానుభావునికే దొరికినది. (హృదయము నుద్దేశించి) హృదయమా! నీ కోరిక యిప్పుడీ రీతి మొలకెత్తినది. (ముద్రికను బుచ్చుకొనఁగోరును; కరాగ్రకంప మభినయించి జనాంతికముగా) చెలీ! నా హస్తాగ్రము కంపించుచున్నది. కావున దానిని నీ వందుకొనుము.

కురితః. హాలా! వేపతేమేఽగ్రహస్తః తత్ త్వం గృహా
ణైనామ్).

చంద్రలేఖా—హాళా! భట్టిణా అ చోరిఅంతరంగాఏ తుహ
కింత్తి వేవంతో హెూఇ అగ్గహత్థో. (హాలా! భర్త్రా చ చోరి
తాంతరంగాయాస్తవ కిమితి వేపమానో భవత్యగ్రహస్తః?)

కువలయావలీ—హాళా! కింత్తి మం లజ్జిదం లజ్జేసి. (హాలా! కిమితి
మాం లజ్జితాం లజ్జయసి)

చంద్రలేఖా—భట్టారఅ! ఇతో ముద్దిఅం పసాదేఇ. (భట్టారక!
ఇతో ముద్రికాం ప్రసాదయ)

శ్రీవత్సః—భో! అహం భణామి। అణ్ణస్సధణం అణ్ణస్సహత్థే ణ
హెూదు. (భోః! అహం భణామి అన్యస్య ధనమన్యస్య
హస్తే న భవతు.)

నాయకః—(సస్మితమ్) చంద్రలేఖే! న్యాయ్య ఏవాయం పంథాః
యదాహ విద్వానయం శ్రీవత్సః.

చంద్రలేఖా—హాళా! సఅం.ఏవ్వ గేణ్హ. (హాలా! స్వయమేవ
గృహాణ.)

కువలయావలీ—(కథంచిత్ కరం ప్రసారయతి.)

నాయకః—భద్రే! కనీయసీమంగులీం ప్రసారయ, స్వయమేవ
ముద్రికామారోపయామి.

కువలయావలీ—(ఆత్మగతమ్) అజ్జ కా గఇ. (అద్య కాగతిః?)

చంద్రలేఖా—(సప్రణయకోపమ్) హాళా! తత్థఏవ్వ కిఅచ్చిరం
విళంబేసి। (హాలా! తత్రైవ కియచ్చిరం విలంబసే)

కువలయావలీ—(కథంచిదంగులీం ప్రసారయతి)

చంద్రలేఖ—భర్త నీ హృదయమును దొంగిలించినను నీకు హస్తాగ్రకంప మేల కలుగుచున్నది?

కువలయావళి—చెలీ! లజ్జితనైయున్న నన్ను మఱింత లజ్జపఱచు చున్నా వేల?

చంద్రలేఖ—భట్టారకా! ఆ ముద్రిక నిట్టులఁ బ్రసాదింపుము.

శ్రీవత్సుఁడు—ఇదిగో! నేను జెప్పుచున్నాను. ఒకరి సొత్తు మఱియొకరి చేతిలోఁ బెట్టఁగూడదు.

నాయకుఁడు—(మందహాసముతో) చంద్రలేఖా! విద్వాంసుఁడైన శ్రీవత్సుఁడు పలికినది న్యాయ్యమైన మార్గము.

చంద్రలేఖ—చెలీ! నీవే యందుకొనుము.

కువలయావళి—(ఎట్టకేలకుఁ జేయిసాఁచును)

నాయకుఁడు—కళ్యాణీ! నీ చిటికెనవ్రేలు సాఁచుము. నేనే ధరింపఁ జేసెదను.

కువలయావళి—(తనలో) ఇప్పుడు నాకేమి కర్తవ్యము?

చంద్రలేఖ—(ప్రణయకోపముతో) ఎంత నేపక్కడనే జాగు నేయుదువు?

కువలయావళి—(ఎట్టకేలకు వ్రేలు సాఁచును)

నాయకః—(కనీయసీ మంగులీ మవలంబ్య శనైరస్యాముఖం సాకూతమవలోకయతి)

కువలయావలీ—(సరోమాంచస్మితం నతముఖీ తిష్ఠతి।)

[నేపథ్యే]

హాళా! చందలేహే! కిఅచ్చిరం. ణవవత్థు దంసణ కుదూహళేణ కువళఆవళిం విణోదేసి। కిఅచ్చిరం పిఅపసాహణాదేవీ అబ్భంతరం గదా। అణ్ణేసంతీ వి తుహ్మే అహం ణోపేచ్ఛామి. (హాలా! చంద్రలేఖే! కియచ్చిరం నవవస్తుదర్శనకుతూహలేన కువలయావలీం వినోదయసి? కియచ్చిరం ప్రియ ప్రసాధనాదేవీ అభ్యంతరం గతా. అన్విష్యన్త్యపి యువామహం నపశ్యామి)

చంద్రలేఖా—(ఆకర్ణ్య) అంహాహా చఓరిఆ ఇదో ఆఅచ్ఛది (అహాహా! చకోరికా ఇత ఆగచ్ఛతి)

[రాజా కువలయావలీం విసృజ్య ముద్రికాం పాతయన్ సవయస్యస్తిరోహితస్తిష్ఠతి]

[ప్రవిశ్య]

చకోరికా—హాళా! చందలేహే! కిఅచ్చిరం (ఇత్యాది పఠతి)

చంద్రలేఖా—ఇదో ఇదో పిఅసహీ. (ఇత ఇతః ప్రియసఖీ)

చకోరికా—(ఉపసర్పతి।)

నాయకుఁడు—(చిటికెనవ్రేలు పట్టుకొని మెల్లగా నాకూత ముతో నామె ముఖమును జూచును)

కువలయావళి—(సిగురాపాటుతోఁ జిఱునవ్వు నవ్వుచు మోము వంచుకొని నిలుచును)

[నే ప థ్య ము న]

చెలీ! చంద్రలేఖా! నవవస్తు దర్శన కుతూహలముతో నెంతసేపు కువలయావళిని వినోదింపఁ జేయుదువు? అలంకర ణాభిలాషముతో దేవి యభ్యంతర మందిరమునకుఁ బోయి చాల సేపయినది. నేనెంత వెదకినను మీరు నాకుఁ గనఁ బడరైతిరి.

చంద్రలేఖ—(విని) ఓహో! చకోరిక యిట వచ్చుచున్నది.

[రాజు కువలయావళిని విడిచి, ముద్రికను నేలఁ

బడవైచి, వయస్యునితో డాఁగి యుండును]

[ప్ర వే శిం చి]

చకోరిక—చెలీ! చంద్రలేఖా! నవవస్తు...(మొదలగు వాక్య ములు మరలఁ బలుకును)

చంద్రలేఖ—ప్రియసఖి! ఇటు; ఇటు.

చకోరిక—(సమీపించును)

చంద్రలేఖా—హళా! సహీఏ మణిముద్దిఆ పరిబ్భట్ఠా। తం అణ్ణేసామో. (హలా! సఖ్యా మణిముద్రికా పరిభ్రష్టా. తామన్విష్యావః)

[సర్వా ముద్రికామన్విష్యంతి।]

చంద్రలేఖా—(నిర్వర్ణ్య, సహర్షమ్) ఇఅం ముద్దిఆ (ఇతి గృహీత్వా) హళా! ఏహి గచ్ఛామో. (ఇయం ముద్రికా. హలా! ఏహి గచ్ఛామః)

(ఇతి పరిక్రామంతి।)

నాయకః—కథం ప్రయాత్యేవ ప్రియతమా।

నాయికా—(నయనే పరాగపాతమభినీయ) హళా! కుసుమరయ సంపాదేణ ఆఉళం మహణేత్తం. (హలా! కుసుమరజః సంపాతేనాకులం మమనేత్రమ్)

చంద్రలేఖా—(జనాంతికమ్) కుసుమసర సంపాదేణ తుహ చిత్తం వి (కుసుమశర సంపాతేన తవ చిత్తమపి.)

(ఇతి పరాగమపనయతి)

కువలయావలీ—(సప్రియాసూయమివ) హళా! దాణిం వి మే ణ హోఇ లోఅణం అవరాఅం. (ఇదానీమపి మే న భవతిలోచన మపరాగమ్)

చంద్రలేఖా—హళా! పరాఓ ణిగ్గదో ణఅణాదో। రాగో ఖు బళిఅం సంకంతో దాణిం వి రమణ। తా కిం విళం బేణ? ఏహి గచ్ఛహ్మో। (హలా! పరాగో నిర్గతో నయనాత్. రాగః ఖలు బలవాన్ సంక్రాంత ఇదానీమపి రమతే. తత్ కిం విలంబేన? ఏహి గచ్ఛావః.)

చంద్రలేఖ—చెలీ! ప్రియసఖి వ్రేలి మణిముద్రిక జాఱిపడి పోయినది. రమ్ము; వెదకుదము.

[అందఱును వెదకుదురు]

చంద్రలేఖ—(పరికించి, సంతోషముతో) ఇదిగో! ముద్రిక. (అని కైకొని) చెలులారా! రండు పోవుదము. (అని పరిక్రమింతురు)

నాయకుఁడు—అయ్యో! ప్రియతమ వెడలిపోవుచున్నదే!

నాయిక—(కంటిలోఁ బుష్పాడిపడుట నభినయించి) చెలీ! కుసుమ పరాగపాతముచే నా నేత్ర మాకులమగుచున్నది.

చంద్రలేఖ—(జనాంతికముగా) కుసుమ శరసంపాతముచే నీ హృదయము సైతము. (అని పరాగము తొలఁగ నూఁదును)

కువలయావళి—(ప్రేమాసూయతోవలె) చెలీ! నాలోచన మింకను నపరాగము కాలేదు.

చంద్రలేఖ—సఖీ! కంటనుండి పరాగము తొలఁగి పోయినది. కాని రాగము మాత్రము బలముగా నిలిచియున్నది. జాగు సేయనేల? పద, పోవుదము.

[ఇతి నిష్క్రాంతాః।]

శ్రీవత్సః—వఅస్స! మహురా ఖు సక్కరేవ్వ పరుసా విదాణిం సిళిట్ఠ సల్లావ గోట్ఠీ. (వయస్య మధురా ఖలు శర్కరేవ పరుషాపీదానీం శ్లిష్టసల్లాప గోష్ఠీ.)

నాయకః—మధురేతి కి ముచ్యతే ।

లలిత కవితా విలాసాః
శ్రుతి మధురా లాప రాగ సంభేదాః ।
యువతి జన పక్షపాతా
నాకృత పుణ్యేషు సమవేతాః. ౧౪.

సఖే! కిమతః పరం కరణీయమస్మాకమ్ ।

శ్రీవత్సః—కిం అణ్ణం సఅళణాఅరిఅ లోఅణాణందాదో (కి మన్యత్, సకలనాగరిక లోచనానందాత్?)

నాయకః—యథాభిరుచితం ప్రియవయస్యాయ ।

(ఇతి పరిక్రామన్ సస్మరణమ్)

ఉత్ఫుల్లగండ మండల
ముల్లసితదృగంత సూచితాకూతమ్ ।
సమయంత్యాపి ముఖాంబుజ
మున్నమితానంగసామ్రాజ్యమ్. ౧౫

[ఇతి నిష్క్రాంతాః సర్వే]

॥ ద్వితీయోఽంకః ॥

[అని నిష్క్రమింతురు]

శ్రీవత్సుఁడు—వయస్యా! ఇప్పు డీ శ్లిష్ట సల్లాప గోష్ఠి పరుష మయినను జక్కెరవలె మధురముగా నున్నది సుమా.

నాయకుఁడు—మధురమే యందు వేల?

లలిత మగు కవిత్వకళా విలాసములును
శ్రుతి సుఖాలాప రాగ సంతతుల గతులుఁ,
దరుణ జనముల పక్షపాతములు నెందు
నకృత సుకృతుల కెపుడు లభ్యములు గావు. 14

మిత్రమా! ఇంక మనము చేయవలసిన పనియేమి?

శ్రీవత్సుఁడు—సకల నాగరక నేత్రానందముకంటెఁ జేయఁదగిన పని మఱియేమి కలదు?

నాయకుఁడు—ప్రియవయస్యుని కిష్టమగు నట్లే కానిమ్ము. (అని పరిక్రమించుచు స్మృతి నభినయించి)

గండ యుగళి ముత్ఫుల్లమై యుండ, నుల్ల
సిలు దృగంత మాకూతంబు దెలుపు చుండఁ,
దన ముఖాబ్జంబు వంచు నా తన్విచేత
నే యనంగ సామ్రాజ్య మిప్డెత్తఁబడియె. 15

[అందఱు నిష్క్రమింతురు]

ద్వితీయాంకము సంపూర్ణము.

# అథ తృతీయోఽంకః

[తతః ప్రవిశ్య]

కంచుకీ—(ఆత్మనో దశామనుసంధాయ)

రుంధానయా బహుముఖం గతిమింద్రియాణాం
వద్ధ్వేవ గాఢమనయా జరయోపగూఢః ।
అంగేన వేపథుమతా చ జడేన చాహం
గంతుం పదాదపి పదం గమితుం న చాలమ్ ॥ ౧.

హంత విశ్వాసో ను ప్రభూణామాశ్వాసముత్పాదయతి।

లక్ష్యేషు పాణిపరివేషమవేక్ష్య తేషు
శ్వాసావధి త్రిచతురేషు పదేషు యానమ్ ।
మైత్రీగిరాం శ్రవసి తారతరశ్రుతీనాం
దేవీ తథాపి హితకర్మణి మాం నియుంక్తే ॥ ౨.

అద్యఖలు విదర్భరాజనందనయా సబహుమానమేవ మాఖ్యాతోఽస్మి । "ఆర్య బభ్రుముఖ! పురాకిల కాలయవన విజయాయ గచ్ఛతా ఆర్యపుత్రేణ సంకల్పిత మాసీద్ 'భగవతి! భవాని! రైవతక కందరకదంబ వనవాసిని! ప్రతినివర్తనానంతర మేవ మయా నిఖిల పురంధ్రి జనానుయాత దేవీజనేన తవ యాత్రామహోత్సవః కారయితవ్యః' ఇతి । తదద్య వయమితో రైవతక ముపసరామః । కువలయావలీ పునరుద్యాన విలోకనాయానేన బలవదస్వస్థశరీరేతి గృహ ఏవ చంద్రలేఖయా సమం నివేశితా । సేయం యథా న బహిరంకణ

# తృతీయాంకము

[ప్రవేశించి]

కంచుకి—(తన దశను బరిశీలించుకొని)

బహుముఖేంద్రియ గతులడ్డుపఱచి వధువు
కరణి జర నన్ను బిగియారఁ గౌగిఁలింప,
నొడలు వడఁక, జడతగల్గ నడవఁజాల;
నడుగు దీసి యడ్గిడనైన నలవి కాదు. 1.

ఆహా! ప్రభువుల విశ్వాసము నా కాశ్వాస మొదవించును.

హాస్తపరివేషమునఁనె లక్ష్యములఁగాంతు
మూఁడు నాల్గడుగులకె యూర్పుల నిగుడ్తు,
పేరెలుంగున నగుపల్కె వినఁగనేర్తు
నైన నన్నె దేవి హితకార్యములఁ బనుచు. 2.

నేఁడు విదర్భరాజనందన సగౌరవముగా నా కిట్లాన తిచ్చినది.—

“ఆర్యా! బభ్రుముఖా! కాలయవనుని జయించుటకుఁ బోవుచు నార్యపుత్రుఁడు మున్నిట్లు సంకల్పించుకొనెను: ‘అంబా! భవానీ! రైవతకకందరకదంబవనవాసినీ! ఈ విజయ యాత్రనుండి తిరిగి వచ్చినవెంటనే సకలపురంధ్రీజన మనువర్తించు దేవీజనముతోఁగలిసి నీ యాత్రామహోత్సవము గావింపగలవాఁడ’నని. కావున మే మిప్పుడు రైవతకమునకు వెడలుచున్నాము. కువలయావళి యుద్యాన విలోకనాయా

మాసాదయతి తథా త్వయా రక్షితవ్యే"తి । తదవహితో దేవీ నిదేశ మనుతిష్ఠామి.

[తతః ప్రవిశతి కువలయావళీ చంద్రలేఖాచ]

చంద్రలేఖా — హళా! ముద్దిఆ విరహేణ అకలపంచాలిఅ భమం తుమం ఏసో ణ అణాది । తా ఏహి ణిక్కంపాఓ విళాసుజ్జాణం గచ్ఛామో. (హలా! ముద్రికా విరహేణా కృత పాంచాలికా భ్రమాం త్వామేవ న జానాతి. తదేహి నిష్కంపే విలాసోద్యానం గచ్ఛావః.)

కంచుకీ—[సపాణి పరివేషం విలోక్య] భోః! కయోరయం పద శబ్దః?

చంద్రలేఖా—అయ్య! చందలేహా ఖు అహం । ఇఅం ఉణ ఇందీవరాళీ ణామఅ అణ్ణా సంచారిఆ కిం వి రహస్సం కహఊణ భట్టిణీఏ పేసిదా । తా ఏదం భట్టిణో సంముహం వాచేమి । తుమం కువళఆవళీఏ ఘరద్దువారం ఓహిదో రక్ఖేహి. (ఆర్య! చంద్రలేఖా ఖల్వహమ్. ఇయం పునరిందీవరాలీ నామికాన్యా సంచారికా కి మపి రహస్యం కథయిత్వా భట్టిన్యా ప్రేషితా. తదేతత్ భర్తుః సమ్ముఖం వాచయామి. త్వం కువలయావల్యా గృహద్వార మవహితోరక్ష.)

కంచుకీ—భద్రే! గమ్యతాం సిద్ధయే శీఘ్రమాగమ్యతాంచ । అహమవహితో భవామి । (ఇతి నిష్క్రాంతః.)

చంద్రలేఖా—హళా! వంచిదో ఖు ఏసో థవిర సోవిదల్లో. (హలా! వంచితః ఖల్వేష స్థవిరసౌవిదల్లః.)

సముచే మిగుల నస్వస్థశరీరమైనదిగావునఁ జంద్రలేఖతోఁగూడ నామె నింటనే యుంచుచున్నాము. ఆమె ముంగిలిదాఁటి పోకుండఁగాపాడు చుండుము;" అని. కావున నే నవహితుఁ డనై దేవి యాదేశమును బాలించెదను.

[కువలయావళియుఁ జంద్రలేఖయుఁ బ్రవేశింతురు]

చంద్రలేఖ—చెలీ! ముద్రిక లేకుండుటచేతఁ బాంచాలికా భ్రమ కలుగదు; గనుక, నిన్నతఁడు గుర్తింపఁజాలఁడు. కావున, నిర్భయముగా రమ్ము; విలాసోద్యానమునకుఁ బోవుదము.

కంచుకి—(చేవెలుంగునఁ జూచి) ఎవరిదీ యడుగుల చప్పుడు?

చంద్రలేఖ—ఆర్యా! నేను చంద్రలేఖనుగదా! యీమె యిందీవ రాళి యను వేఱొక పరిచారిక. ఏదో రహస్యముచెప్పి దేవి యీమెను బంపినది. దానిని, భర్తృసమ్ముఖమునకుఁ బోయి నివేదించెదను. నీవు కువలయావళీ గృహద్వార మును భద్రముగాఁ గాపాడుచుండుము.

కంచుకి—కళ్యాణీ! కార్యసిద్ధికైపోయి వేగముగారమ్ము, నేను జాగరూకుఁడనై యుండెదను. (అని నిష్క్రమించును)

చంద్రలేఖ—సఖీ! ఈ వృద్ధకంచుకిని గనుఁ బ్రామితిమి.

కువలయావళీ—(ఆత్మగతమ్) ణ ఆణే కహం ఏసో అణుసఓ (అద్ధివో?) వంచిదవ్వో త్తి। (ప్రకాశమ్) హాళా! కిఅద్దూరే కదళిఆఘరం. (న జానే కథ మేషో ఽ నుశయో వంచయి తవ్య ఇతి. హాలా! కియద్దూరే కదలికాగృహం?)

చంద్రలేఖా—ఇదం ఖు। పవిసదు పిఅసహీ। దిగ్ఘిఆవ తరంగ సీఅరపరిబ్భిఅసీఅళే చందసిళాఅళే ఉపవిసామో. (ఇదం ఖలు. ప్రవిశతు ప్రియసఖీ. దీర్ఘికాయా స్తరంగ శీకర పరిభ్రమ శీతలే చంద్రశిలాతలే ఉపవిశావః)

[ఉభే తథా కురుతః]

కువలయావళీ—హాళా! బళిఅం ఖు సందావవంతి మహ అంగా ఇ. (హాలా! బలవత్ ఖలు సంతాపవంతి మమాంగాని)

చంద్రలేఖా—సహి! సుహణిమిత్తం। ఇహ ఏవ్వ పచ్ఛాఅసీఅళే తుజ్ఝ సందావో సమిస్సది. (సఖి! శుభనిమిత్తమ్. ఇహైవ ప్రచ్ఛాయ శీతవే తవ సంతాపః శమిష్యతి.)

[తతః ప్రవిశతి నాయకః]

నాయకః—(మదనావస్థాం నాటయన్) కథమభిసంధీయతే పటుధియాపి మయా ధృతే రభిసంధిపరిపంథీ మన్మథః।

జయతితరాం రతిజానే
రనుభావో నిఖిలధీరపరిభావీ।
య దసజ్జితా రణంతీ
బాణా నన్వియ్య శింజనీ భ్రమతి ॥ 3.

కువలయావళి—(తనలో) ఈ పశ్చాత్తాపము నెట్లు గనుఁ బ్రాము నగునో తెలియకున్నది. (ప్రకాశముగా) చెలీ! కదళికా గృహమెంత దూరముననున్నది?

చంద్రలేఖ—ఇదియే కదళికాగృహము. ప్రవేశింపుము. ప్రియ సఖీ! ఈ దీర్ఘికా తరంగశీకరములచేఁ జల్లనైన యీ చంద్ర శిలాతలమునఁ గూర్చుండుదము రమ్ము.

(ఇరువురు నట్లు సేయుదురు)

కువలయావళి—చెలీ! నాయవయవము లత్యధికముగాఁ దపించు చున్నవి.

చంద్రలేఖ—సఖీ! ఇది శుభసూచకము. చల్లని నీడగల ఇచ్చో టనే నీ సంతాపము శమింపఁగలదు.

[నాయకుఁడు ప్రవేశించును]

నాయకుఁడు—(మదనావస్థ నటించుచు) ఔరా! నేనెంత ధీర చిత్తుఁడ నయినను ధైర్యాభిసంధివరిపంథియగు మన్మథు నభి సంధించుటెట్లు?

సజ్జితముగాక మున్నె నిస్వనముతోడ
శరములను వెదకుచు నారి యఱుగుకతన
నా రతీశుని యనుభావ మఖిల ధీర
హృదయ పరిభావి యగుచు జయించు మిగుల. 3.

[సాశంసనమ్]

ఉత్ఫుల్ల గండయుగ ముద్గత మందహాస
ముద్వేల రాగమురరీకృత కామతంత్రమ్ ।
హస్తేన హస్త మవలంబ్య కదాను సేవే
సల్లాప రూప మమృతం సరసీరుహాక్ష్యాః ॥ 8.

కథం చిరాయతి శ్రీ వత్సః ।

[ప్రవిశ్య విదూషకః]

విదూషకః — (సహర్షమ్) అజ్జ జోగమాయామహప్పాసవావ దేసేణ సఅలో వి ణఅరీసీమంతిణీజణో దేవీహిం సమం పట్ఠావిదో । తా మహ మంతప్పహావం పిఅసహం ణివే దేమి । (పరిక్రమ్య) వఢ్ఢదు పిఅవఅస్సో. (అద్య యోగ మాయామహాత్మ్యావాప దేశేన సకలోఽపి నగరీ సీమం తినీ జనో దేవీభిః సమం ప్రస్థాపితః తన్మమ మంత్ర ప్రభావం ప్రియసఖం నివేదయామి. వర్ధతాం ప్రియ వయస్యః)

నాయకః—(సాకూతస్మితమ్) అపి సఖే! ఫలితస్తవ నిధానసాధనే మంత్రప్రయోగః?

విదూషకః—భో! మంతబలేణ ణిక్కాసిదే దేవీపణ్ణఈలోఏ సో ణిహికేణ వి దూసందేసేణ పిఆఏణ దాణిం రక్ఖిజ్జ ఇ । ఉప్పిణీ బహ్మాముహం కువళఆవళీ రక్ఖణే ణిఉజ్జే ఇ. (భోః! మంత్రబలేన నిష్కాసితే దేవీపన్నగీలోకే స నిధిః కేనాపి దుస్సందర్శేన పిశాచేనేదానీం రక్ష్యతే. రుక్మిణీ బభ్రు ముఖం కువలయావళీ రక్షణే నియోజయతి.)

(కోరికతో)

గండయుగళి ముత్పులకమై క్రాలుచుండ,
నుద్గతం బైన చిఱునగ వొప్ప, రాగ
మెలయ, స్మరతంత్ర మంగీకరింపఁబడుచు
దనర, నా పయోజాక్షి సల్లాప మనెడు
నమృత మామె హస్తమున నా హస్తమూని
యింక నెన్నండు నేను సేవింపఁ గలనొ. 4

ఏమిది? శ్రీవత్సుఁ డాలసించు చున్నాఁడు?

[ప్రవేశించి]

విదూషకుఁడు—(సంతోషముతో) యోగమాయా మహో త్సవమను మిషతో నగరమందలి పేరటాండ్రనందఱను దేవే రులతోఁగూడ వెడలనంపితిని. ఇఁక నా మంత్రప్రభావ మును బ్రియవయస్యునకుఁ దెలియఁజెప్పెదను. (పరి క్రమించి) ప్రియవయస్యుఁడు వర్ధిల్లుఁగాక!

నాయకుఁడు—(ఆకూతస్మితముతో) మిత్రమా! నిధానమును సాధించుటలో నీ మంత్రప్రయోగము ఫలించినదా?

విదూషకుఁడు—వయస్యా! నా మంత్రబలముచే దేవీ జన మను నాడుఁ బాముల లోకమంతయుఁ దొలఁగిపోయినది; గాని, యా నిధానమునిప్పుడు కురూపి యగు నొక పిశా చము కావలియై కాచుచున్నది. కువలయావళిని రక్షింప బభ్రుముఖుని రుక్మిణి నియోగించినది.

నాయకః—సోఽయం సామదానాభ్యామభేదనీయో విశ్వాసీ సౌవిదల్లః ।

శ్రీవత్సః—సోఖు అహిఆరీ, తం వి సుణుఅముహేణసావరాహం కాఊణ కారాఘరంమి కిం ణివేసేమి? (సఖల్వభిచారీ. తమపి శూన్యముఖేన సాపరాధం కృత్వాకారాగృహే కిం నివేశయామి?)

నాయకః—శాంతం పాపం శాంతం పాపమ్. ధిజ్ మూర్ఖ! పర మాప్తజనే పాపమాశంకసే ।

శ్రీవత్సః—తా సో చిరం సుఖిహోదు । (తత్ స చిరం సుఖీ భవతు)

నాయకః — ఇమామాతపవేలాం కదలికాగృహేఽతివాహ్య రజనీముఖే సముచితముపాయమాచరామః ।

శ్రీవత్సః—భో! ఇదం ఉజ్జాణం. (భో! ఇదముద్యానమ్.)

[ప్రవేశం నాటయతః]

రాజా—

రాజత్కోరకకంటకా మధుకరీఝుంకారవాచాలినీ
రాలోలస్తబకస్తనీరవిరలానున్న ప్రవాలాధరాః ।
ఆలింగంతి లతావధూరతితరామానమ్రశాఖాకరై
రత్యాయూఢరసా రసాలరసికాః కాంతే వసంతోత్సవే. ౫.

నాయకుఁడు—విశ్వాసియగు నా ముదుసలి కంచుకి సామదాన ములకు లొంగువాఁడు కాఁడు.

విదూషకుఁడు — వాఁడు చిల్లంగివాఁడని, శూన్యముఖమున వానిపై నేర మారోపించి వానిని గారాగృహామం దుంతునా?

నాయకుఁడు—పాపము శమించుఁ గాక! పాపము శమించుఁ గాక! ఛీ! మూర్ఖా! పరమాప్తుఁడయిన వాని యెడలఁ బాపమును శంకించుచున్నావు.

శ్రీవత్సుఁడు — అట్లయినయెడల నతఁడు చిరకాలము సుఖ ముండుఁగాక!

నాయకుఁడు — ఇప్పుడీయెండవేళ నీ కదళికా గృహమందు గాలము గడపి చీకటి పడునంతనే తగిన యుపాయ మాచ రింతము.

శ్రీవత్సుఁడు—వయస్యా! ఇదియే యుద్యానము.

[ప్రవేశము నటింతురు]

రాజు—రాజిల్లుచుండు కోరకకంటకముల
భృంగఝంకారహుంకృతులఁ జెన్నొంది
యాలోలగుచ్ఛస్తనాకీర్ణము లయి
యవిరళానున్నంబు లగుచు నొప్పారు
పల్లవోష్ఠంబుల భాసిల్లుచున్న
యీ లతావధువుల నీ చూతరసికు
లారూఢమైన రసాధిక్య మొప్పఁ
జాఁగివంగిన తమ శాఖాకరములఁ

శ్రీవత్సః—భో! కిం ఫళం వసంతప్పసంసాఏ । సవ్వసమఅ పట్టబంధో పాఉససమఓ పసంసీఅదు. (భోః! కిం ఫలం వసంత ప్రశంసయా? సర్వసమయ పట్టబంధః ప్రావృట్ సమయః ప్రశస్యతామ్.)

నాయకః—కథయ కథమేతావానుత్కర్షో వర్షాణామ్ ।

శ్రీవత్సః—జం తత్థ కణ్ణరసాఅణ ణిమంతక్ఖరో ణాసిఆరసాఅణ పాకగంధో జీహారసాఅణపదత్థవిత్థరో బహ్మణాణం కప్పరుక్ఖస రూవో హోఇ అపరపక్ఖో. (యత్ తత్ర కర్ణరసాయననిమంత్రాక్షరో, నాసికారసాయన పాకగంధో; జిహ్వారసాయన పదార్థవిస్తరో బ్రాహ్మణానాం కల్పవృక్షసరూపో భవత్యపరపక్షః.)

నాయకః—సాధు కుక్షింభర! సాధు ।

శ్రీవత్సః—భో! పేచ్ఛ సఅళకరణగ్గామ హిఅఅరం సోభగ్గం సింగారవణస్స. (భోః! పశ్యసకలకరణగ్రామహృద్యం సౌభాగ్యం శృంగారవనస్య.)

నాయకః—(సార్థాంగీకారమ్)

ఇతో భృంగీగీతం విహరణమితో మందమరుతా<br>
మితో వల్లీలాస్యం పరిచితిరితః పుష్పరజసామ్<br>
అతో భూతం తృప్తైరితరకరణై ర్హాంత రసనా<br>
పునస్తస్యా బింబాధరమధువినా శుష్యతి మమ. ౬.

గాంతమై వెలయు వసంతోత్సవమున
బిగియారు కౌఁగిటన్ బెనవెట్టువారు. 5.

శ్రీవత్సుఁడు—ఓయి వయస్యా! ఈ వసంతప్రశంసవలన నేమి ఫలము? సర్వర్తురాజమయిన వర్షకాలమును బ్రశంసింపుము.

నాయకుఁడు—వర్షకాలమున కంత యుత్కర్షమేఁటికో చెప్పుము.

శ్రీవత్సుఁడు — ఏఁటి కంటేనిఁ గర్ణరసాయనమైన నిమంత్రణాక్షరములు, నాసికా రసాయనమైన పాకగంధము, జిహ్వారసాయనమైన పదార్థవిస్తరముఁగల యపరపక్షము బ్రాహ్మణులకుఁ గల్పవృక్షము వంటిది.

నాయకుఁడు—సెబాసు! తిండిపోఁతా! సెబాసు!

శ్రీవత్సుడు—ఓహో! చూడవయ్యా! సకలేంద్రియములకును హృద్యమైన యీ శృంగారవనసౌభాగ్యము!

నాయకుఁడు—(అర్థాంగీకారముతో)

ఈకడ భృంగగీతములు, నీకడ మందమరుద్విహారముల్,
ఈకడ వల్లిలాస్యమిఁక, నీకడఁబుష్పరజమ్ము నొప్పఁగా
నా కరణంబులం దిపుడు నాలుగు తృప్తివహించె; [జిహ్వయే
వ్యాకులమొందు నామె యధరామృతమానమిశోష [మొందుచున్. 6.

శ్రీవత్సః—భో! ఇయం ఖు విఅసిదారవిందసుందర మఅరందణీసందపరిసేఅ గరుఅచక్కవాఅ ఉళపక్ఖవిక్ఖేవ కంపంతకువళఅవళ ఆమోదమేదుర మందమారుఆ విళాసుజ్జాణ దిగ్ఘిఆ.) (భోః! ఇయం ఖలు వికసితారవిందసుందర మకరందనిష్యందపరిషేక గురుకచక్రవాక కులపక్షవిక్షేప కంపమాన కువలయవలయామోద మేదురమందమారుతా విలాసోద్యానదీర్ఘికా.)

నాయకః—అత్ర ఖలు ।

రక్తాబ్జసైకతావర్త రథాంగయుగలోత్పలైః
స్థితమేకత్ర తద్గాత్ర తులాభ్రష్టాధికారిభిః. ౭.

కువలయావళీ—హలా! దహఇ మే అంగేసు జరతాదవేణ సందావో. (హళా! దహతి మేఽంగేషు జరతాతపేన సంతాపః.)

చంద్రలేఖా — బహళదరరసాళాసప్పచ్ఛాఅసీఅళే కుదోఇమంమి పవేసో ఆదవస్స? (బహలతరరసాలాశాప్రచ్ఛాయశీతలే కుతోఽస్మిన్ ప్రవేశ ఆతపస్య?)

శ్రీవత్సః—(ఆకర్ణ్య నిరూప్య) భో! ఇఅం ఖు చందలేహాదుదీఅ కువళఅవళీ. (భోః! ఇయం ఖలు చంద్రలేఖా ద్వితీయా కువలయావళీ.)

నాయకః—(సానురాగ సంభ్రమమ్) సఖే! శ్రీవత్స!

క్వాసౌ దృశోరమృతవర్తిరతర్కణీయా
క్వానందసిద్ధిఘుటికా నిరుపాధిసిద్ధా ।

శ్రీవత్సుఁడు—ఓహో! మిత్రమా! అందముగా వికసితములయిన యరవిందముల సుందరమకరంద నిష్యందబిందుసందోహముచేఁ దడిసిన తమ ఱెక్కల విదళించుకొను చక్రవాకంబులు, నా పక్షిపక్షవిక్షేపంబున వడంకు కువలయవలయములును, వాని సౌరభముతో మేదురమయి వీచు మందమారుతములును గల యీ విలాసోద్యాన దీర్ఘికా రామణీయకమును దిలకింపుము.

నాయకుఁడు—ఇక్కడ—

ఆ మనోరమాగాత్రంబులందు వెలయు
రామణీయకమున కెనరాక యోడి
సైకతావర్తరక్తాబ్జకోకయుగళ
కైరవంబులు నొక్కచోఁగలిసియుండు. 7.

కువలయావళి—చెలీ! ఈ ముదు రెండవలని సంతాపము నా యవయవములన్ను దహించుచున్నది.

చంద్రలేఖ—నలువైపులను దట్టముగాఁ గ్రొమ్మావిజొంపములతోఁ గ్రమ్ముకొని చల్లని నీడలు గల యీ తావున కెండ యెందుండి రాఁగలదు?

వయస్యుఁడు—(విని, నిరూపించి) అదిగో! చంద్రలేఖతో వచ్చిన కువలయావళి!

నాయకుఁడు — (అనురాగ సంభ్రమములతో) వయస్యా! శ్రీవత్సా!

ఎచట? నే మూల? నున్నదా యింతి నా న
యనముల కతరణీయామృతార్ద్రవర్తి?

క్వాకల్పనా పరిణతా నవకల్పవల్లీ
క్వానక్షరా వసతి మోహనమూలవిద్యా. ౮.

శ్రీవత్సః—ఇదం ఖు కదళిఅఘరమ్. (ఇదం ఖలు కదలికా గృహమ్).

నాయకః—(విలోక్య)

ఇయమనిలచలితకదలీ
దళేషు పరిలక్షితా చ పిహితా చ ।
ఉత్కంఠయతి మనో మే
రతిరివ విశ్లేషసంశ్లేషైః. ౯.

సఖే! ప్రసంగముపగమ్య యథావసర ముపసరావః.

శ్రీవత్సః—భో! భో! జాణే. సంగమాదో వి పేమ్మపరిక్ఖణంసుహఅరం త్తి. (భో భో! జానే సంగమాదపి ప్రేమపరీక్షణం సుఖకరమితి.)

నాయకః—సఖే! పరమానందసర్వస్వం సర్వముదాహరసి ।

అంతర్హితో నిగదితాని మనోరమాయాః
శృణ్వన్ ముహూర్తమపి భావనివేదనాని ।
ప్రాయేణ నందతి యథా న తథా కృతాత్మా
వర్షాన్ సహస్రమపి కేవలమేలనేన. ౧౦.

ఎందు? నేత్రకాంత? నున్నదానందసిద్ధి
ఘుటిక నిరుపాధిసిద్ధ యా కోమలాంగి?
ఎచట? నేప్రక్క? నున్నదా యిందుముఖి య
కల్పనాపరిణతనవకల్పవల్లి?
అచటనెచ్చోట? నున్నదనక్షర యయి
క్రాలుచున్న యా మోహనమూలవిద్య? 8.

శ్రీవత్సుఁడు—అదిగో! నిదియేకదా కదళీగృహము?

నాయకుఁడు—(చూచి)

పవనచలనసంచలితరంభాదళముల
నీమె దృష్టయై పిహితయై నామనంబు
గరము విశ్లేషసంశ్లేషగతుల రతియుఁ
బోలి యుత్కంఠయిప్పుడు పొందఁజేయు. 9.

మిత్రమా! ప్రసంగము ననుసరించి తగినసమయము రాఁగానే ప్రవేశింతము.

శ్రీవత్సుఁడు — ఔనయ్యా! కూటమికంటెను ప్రేమపరీక్షణ మెక్కుడు సుఖదాయకమని నే నెఱుఁగుదును.

నాయకుఁడు—మిత్రమా! పరమానందసర్వస్వమైన దంతయు నీ వుదాహరించుచున్నావు.

ప్రేయసీనిజభావనివేదనముల
జాటుగ నొకనిమేషంబుపాటువినఁ గృ!
తాత్ముఁ డొందుమోదంబు సంప్రాప్త మగునె
వేలకొలఁదేండ్ల కేవలమేలనమున? 10.

[ఉభౌ లతాంతరితౌ తిష్ఠతః]

శ్రీవత్సః—భో! పేచ్ఛ ఇమాఏ వేసేణేవ్వ సందావో సవ్వక్ఖరం ఆచక్ఖీఅది. (భో! పశ్యాస్యా వేషేణైవ సంతాపః సర్వాక్షర మాఖ్యాయతే.)

నాయకః—సఖే! సమ్యగుపలక్షితం భవతా।

ఆకల్పైరతిసాంద్రచంద్రఘుటికా ప్రాయైస్తనోస్తర్పణం
శ్రీగంధద్రవలేపనేన కుచయోరత్యంతమాలేపనమ్।
లీలాతామరసోదరేణ కరయోరక్ష్ణోశ్చ సంవాహనం
ప్రేయస్యాః ప్రకటీకరోతి విషమాం హా హన్త తాప
[వ్యథామ్. ౧౧

కువలయావళీ — సందావకారణం కదళిఆఘరం సందావణివారణం త్తి అళీఅం మంతేసి. (సంతాపకారణం కదలికాగృహం సంతాపనివారణమిత్యలీకం మంత్రయసీ.)

[చంద్రలేఖా నవకదళీదళైరేనాం ఛాదయంతీ వీజయతి]

కువలయావళీ — హళా! పుఢమం కప్పూరేణ ధూవిదం మఅణాణళం దాణిం కింతి కదళీదళాణిళేహిం పజ్జళిఅం కరేసి. (హలా! ప్రథమం కర్పూరేణ ధూపితం మదనానలమిదానీం కిమితి కదలీదళానిలైః ప్రజ్వాలితం కరోషి?) (ఇతి తాన్యపక్షిపతి)

చంద్రలేఖా—(ఆత్మగతమ్) హంత! మఅణసందావో సముద్దీవిదో ఏదాఏ। (ప్రకాశమ్) హళా! అహీరా ఖు తుమం. (హంత! మదనసంతాపః సముద్దీపిత ఏతస్యాః. హలా! అధీరా ఖలు త్వమ్.)

[ఇరువురును లతలచాటున డాఁగియుందురు]

శ్రీవత్సుఁడు—అదిగో! మిత్రమా! చూడుము. ఆమె వేషమే యామె సంతాపమును ప్రత్యక్షరము స్పష్టపఱచుచున్నది.

నాయకుఁడు—వయస్యా! చక్కఁగా గుర్తించితివి.

అనుకూలంబగు సాంద్ర చంద్ర ఘుటికా ద్యాకల్పముల్ [మేనిపైఁ;
జేనులక్షా మెందుగఁ జందనద్రవముచర్చల్; తమ్మిపూ రేకులన్
గనులక్షా జేతులనొత్తుటన్ గనినచోఁగట్టా మదీయప్రియా
తనుతాపవ్యథ యెంత దుర్భరమొ వ్యక్తంబౌను స్పష్టం [బుగా 11.

కువలయావళి — సంతాపకారణంబైన యీ కదళీగృహము సంతాపనివారక మని బూటకములాడుచున్నావు.

(చూ. అను. పాట 6)

[చంద్రలేఖ లేఁతయరఁటియాకులతో నామె దేహమును గప్పుచు విసరును]

కువలయావళి—సఖీ! మొదటఁ గర్పూరముతో రాజఁబెట్టిన యీ మదనాగ్ని నిప్పుడీ యరఁటియాకుల వీచుచు నేల ప్రజ్వలింపఁజేయుదువు?

(అని, వానిని దొలఁగించును)

చంద్రలేఖ—(తనలో) అయ్యో! పాపము! ఈమెకు మదన సంతాప మత్యధికముగా నున్నదిగదా! (ప్రకాశముగా) చెలీ! నీ వధీరవునుమా.

కువలయావళీ—హాళా! తస్స అహ్మాణం భట్టిణో దంసణాదో ప హుది కుకూళగ్గిమగ్గం విఅ సమగ్గ వేఅణం అప్పాణం ధారేంతిం వి మం అహీరేత్తి కహం వాహరసి. (హలా! తస్యాస్మాకం భర్తుర్దర్శనాత్ ప్రభృతి కుకూలాగ్నిమగ్నమివ సమగ్ర వేదనమాత్మానం ధారయంతీమపి మామధీరేతి కథం కసి?)

శ్రీవత్సః—భో వఅస్స! కిం సుదం ఏదం? (భో వయస్య! కిం శ్రుతమేతత్?)

నాయకః—సఖే! శబ్దగ్రాహిణా ఫలితమస్మత్కరణేన।

ఆకర్ణితాని నను కర్ణరసాయనాని

సఖ్యాః పురో నిగదితాన్యతివత్సలాయాః।

ఏతాని తాని వచనాని మనోరమాయా

భావానుబంధపిశునాన్యపకైతవాని. ౧౨.

చంద్రలేఖా—హాళా! తుహ అణుమదిం విణా భట్టారఅం ఆణేదుం ఆసంకేమి. (హలా! తవానుమతిం వినాభట్టారక మానేతుమాశంకే.)

కువలయావళీ—(ఆత్మగతమ్)

కళకంఠో విసకంఠో

హోదు పవాళో వి దగ్ధకరవాళో।

చందోవి విసణిసందో

జళంత దహణో పడీరగిరిపవణో. ౧౩.

రఇపఇణా కువిదేణ వి

మరణాదో ఉవరి కింణు కాదవ్వం।

పిఅసహి! సిలాహణిజ్జం

ణహి ణహి శంకేమి కణ్ణాఅ సమఅమ్. ౧౪.

కువలయావళి—చెలీ! మన ప్రభువును దర్శించినది మొదలు ఊఁకనిప్పున మునిఁగినదివలె నుడికిపోవుచున్న దేహమును నేను ధరించుచున్నను న న్నధీరవందు వేల?

శ్రీవత్సుఁడు—వయస్యా! ఇది వింటివా?

నాయకుఁడు—నా శ్రవణేంద్రియము సఫలమైనది.

ఆ మనోరమ వాత్సల్యధామ చెలిస
మక్షమునఁ గర్ణపేయంబు లయినపలుకు
లాడఁగావింటి నవియు భావానుబంధ
పిశునములు వ్యాజవిరహితవిలసితములు. 12.

చంద్రలేక—చెలీ! నీయనుమతిలేక భట్టారకుని దోడితెచ్చుటకు సందేహించుచున్నాను.

కువలయావళి—

కలితకలకంఠ మిఁక విషకంఠమగుత!
పల్లవము దీర్ఘతరకరవాల మగుత!
చందమామయు గరళనిమ్యందుఁ డగుత!
మలయపవనుండు నుజ్జ్వలజ్జ్వలనుఁ డగుత! 13.
రతివిభుఁడు కోపకాఁడైన మృతిఘటించు
నంతకంటెను జెడుగేమి యతఁడొనర్చు?
శ్లాఘ్యమైనట్టి కన్యకాసమయ మింక
దాఁటఁజాలను బ్రియసఖి! దాఁటఁజాల. 14.

(కలకంఠో విషకంఠో భవతు ప్రవాలోఽపి దీర్ఘకరవాలః।
చంద్రోఽపి విషనిష్యందో జ్వలద్దహనః పాటీరగిరిపవనః॥
రతిపతినా కుపితేనాపి మరణాదుపరి కిన్ను కర్తవ్యమ్।
ప్రియసఖ! శ్లాఘనీయం నహినహి లంఘయామి కన్యకా సమయమ్॥)

శ్రీవత్సః—సాహు మణస్సిణి! సాహు. (సాధు; మనస్విని! సాధు.)

చంద్రలేఖా—(ఆత్మగతమ్) ఆసాసపసంగంతరేణ ఏదం విహ్మారిదవేఅణం దావ కరేమి। (ప్రకాశమ్) హాళా! ఉణ్హం ఉణ్హేణ సంమఇ త్తి భట్టిణో సందావేణ తుహ సందావో సంమఇ. (ఆశ్వాస ప్రసంగాంతరేణైతాం విస్మృతవేదనాం తావత్ కరోమి. హాలా! ఉష్ణముష్ణేన శామ్యతీతి భర్తుః సంతాపేన తవ సంతాపః శామ్యతి.)

కువలయావళీ—హాళా! భట్టిణో సందావో త్తి అళీఅపిఅజప్పిదేణ మం ఆసాసేసి. (హాలా! భర్తుః సంతాప ఇత్యలీక ప్రియ జల్పితేన మామాశ్వాసయసి.)

చంద్రలేఖా—హాళా! సచ్చం ఏదం। సవామి పిఅసహీఏ. (హాలా! సత్యమేతత్ శపే ప్రియసఖ్యై.)

కువలయావళీ—(సహర్షగద్గదమ్) హాళా! తుహ కేణ ఆచక్ఖిదం? (హాలా! తవ కేనాఖ్యాతమ్?)

చంద్రలేఖా—ణం దేవీహింసమం కాదవ్వస్స భఅవదీమహూసవగమణస్స అంతరాఏణ తుహ ణిరూఢరాఅస్స భట్టిణో అదక్ఖిణ్ణేణ. (నను దేవీభిః సమం కర్తవ్యస్య భగవతీ

శ్రీవత్సుఁడు—సెబాసు! మానవతీ! సెబాసు!

(చూ. అను. పాట 7)

చంద్రలేఖ—(తనలో) ఆశ్వాసప్రసంగము మఱియేదైన నొకటి తెచ్చి యీయామె తన వేదన మఱచిపోవునట్లు చేసెదను. (ప్రకాశముగా) చెలీ! ఉష్ణముష్ణముచేతనే శమించునన్నట్లు నీ సంతాపము భర్తృసంతాపముచేతనే చల్లారును.

(చూ. అను. పాట 8)

కువలయావళి—చెలీ! భర్తృసంతాప మని బూటకములాడి న న్నాశ్వాసింపఁ జేయుచున్నావు.

చంద్రలేఖ—చెలీ! ఇది సత్యము. నీతోడు.

కువలయావళి—(సంతోషముతో గద్గదస్వరమున) చెలీ! నీకెవరు చెప్పిరి?

చంద్రలేఖ—దేవీజనముతోఁగలిసి చేయఁదగిన భగవతీమహో త్సవ గమనమునకు విఘ్నకారియైన గాఢానురాగుఁడగు నీ వల్లభుని యదాక్షిణ్యమే.

మన్మహోత్సవగమనస్యాంతరాయేణ తవ నిరూఢ రాగస్య భర్తురదాక్షిణ్యేన)

శ్రీవత్సః—(సహసోపసృత్య) ఇమిణా అ పుడమం తహా వణళుళా అమంసళేణ దాణిం పిఅవఅస్స చింతావ ఏవ్వం పరిక్ఖిణేణ సిరివచ్ఛేణ బంహ్మణేణ. (అనేన చప్రథమం తథా వనలులాయ మాంసలేనేదానీం ప్రియవయస్య చింతయైవం పరీక్షీణేన శ్రీవత్సేన బ్రాహ్మణేన)

కువలయావళీ—(ససాధ్వసకంపమ్) అహ్మో! మాణుసీ ఏ భణాఇ వాణరో వాఆఏ. (అహో! మానుష్యా భణతి వానరో వాచా.)

చంద్రలేఖా—(జనాంతికమ్) హాళా! మా ఏవ్వం భణ। భట్టిణో ఖు పిఅవఅస్సో ఏసో। (ఆత్మగతమ్) భట్టా వి సణ్ణిహిదో భవే। హోదు, ఏవ్వం దావ। (ప్రకాశమ్) భో! దుట్ఠ. బంహ్మణ! ఈరిసాఇ అదక్ఖిణాఇ ఉవదిసందం తుమం దేవీఏ సణ్ణిహిం ణఇస్సం. (ఇతి శిఖాయాం గృహ్ణాతి.) హాలా! మైవం భణ. భర్తుః ఖలుప్రియ వయస్య ఏషః. భర్తాపి సన్నిహితో భవేత్. భవతు ఏవంతావత్; భోః దుష్టబ్రాహ్మణ! ఈదృశాన్యదక్షిణాన్యుపదిశంతం త్వాం దేవ్యాః సన్నిధిం నేష్యామి.)

శ్రీవత్సః—అవిహా అవిహా! (అవిహా, అవిహా!)

నాయకః—నూనం మదుపవరణాయైవ సంవిహిత మేవం విదగ్ధయా చంద్రలేఖయా। తదుపసర్పామి। సఖే! న భేతవ్యం న భేతవ్యమ్।

శ్రీవత్సుఁడు—(ఆకస్మికముగా సమీపించి) అంతేకాదు; మొదట నడవిదున్నవలె బలిసియుండి యిప్పుడు ప్రియవయస్యుని గుఱించి కలిగిన చింతచేఁ గృశించియున్న యీ బ్రాహ్మణుఁడు శ్రీవత్సుఁడుసైతము చెప్పుచున్నాఁడు.

కువలయావళి—(భయముతో వడఁకుచు) అమ్మయ్యో! మానవునివలె మాటలాడుచున్నదీ వానరము!

చంద్రలేఖ—(జనాంతికముగా) చెలీ! అట్లనకుము. ఇతఁడు ప్రభువునకుఁ బ్రియవయస్యుఁడు. (తనలో) భర్తసైతము చేరువగానే యుండియుండవచ్చు కానిమ్ము; ఇట్లందును, (ప్రకాశముగా) ఓరీ! దుష్టబ్రాహ్మణుఁడా! ఈరీతి మోటుమాటలాడు నిన్ను దేవియొద్దకుఁ దీసికొనిపోయెదను. (అని జుట్టుపట్టుకొనును)

శ్రీవత్సుఁడు—అయ్యో! అయ్యో!

నాయకుఁడు—(తనలో) ఇది నిక్కముగా నిపుణమైన యీ చంద్రలేఖ నన్ను రావించుటకై పన్నిన పన్నుగడ. కావున సమీపించెదను. (ప్రకాశముగా) భయపడకు; మిత్రమా! భయపడకు.

చంద్రలేఖా—(శ్రీవత్సం విసృజ్య) జేఉ జేఉ భట్టా. (జయతు జయతు భర్తా.)

[కువలయావళీ సశృంగారసాధ్వసమ్ ఉత్థాతుం ప్రయతతే।]

నాయకః — (బలాదేనాం నివారయన్) నహి వయమిదానీ ముపచరణీయాః । కిం త్వస్మాభిరేవ,

అభినవబిసకాండపేలవం
తదను పయోధరభారభంగురమ్ ।
తదుపరి పరితాపనిస్సహం
పరిచరణీయమిదం తవాంగకమ్ 15.

చంద్రలేఖా — అకిదాసణసపరిగ్గహే భట్టారఅంమి కహం పి అసహీ ఉవవిసది। తా సిణిద్ధసీఅళసిళేకదేసం ణం అళం కరేదు మహారాఓ. (అకృతాసనపరిగ్రహే భట్టారకే కథం ప్రియసఖ్యుపవిశతి ? తత్ స్నిగ్ధశీతలశిలైకదేశం నన్వలంకరోతు మహారాజః)

నాయకః—యదభిరుచితం ప్రియవయస్యాయై । [ఇత్యుపవిశతి]

[కువలయావళీ సాంగసంకోచా సఖీం సాసూయమివ లోకయంతీ పునరుత్తిష్ఠతి.]

నాయకః—(తాముత్తరీయే నిగృహ్య.)

కరభోరు ! విపులజఘనే !
తనుమధ్యే ! నిమ్ననాభి ! నిబిడకుచే !

చంద్రలేఖ—(శ్రీవత్సుని విడిచిపెట్టి) జయము! జయము! ప్రభువులకు జయ మగుఁగాక!

[కువలయావళి శృంగారభయములతో
లేచుటకుఁ బ్రయత్నించును]

నాయకుఁడు — (బలాత్కారముగా నామెను నివారించుచు) ఇప్పు డుపచారము పొందవలసినది మేముకాదు; మాచేతను నీవే.

తమ్మిఁదూఁడువలెఁ బేలవ మ్మదియును
నెఱయు కుచభారమున వంగె; మఱియును బరి
తాపనిస్సహం బయ్యె నీ తనువు తన్వి!
కానఁ బరిచర్యయుంబు గాదె మాకు? 5.

చంద్రలేఖ—ప్రభువు లాసనము నలంకరింపకుండఁగాఁ బ్రియసఖ యెట్లు కూర్చుండును? కావున మహారాజుగారు స్నిగ్ధశీతలమైన యీ శిలాతలైకదేశము నలంకరింతురుగాక!

నాయకుఁడు—ప్రియసఖ కిష్టమయినదె యగును గాక! (అని కూర్చుండును)

[కువలయావళి యంగసంకోచముగలదై యసూయతో సఖిని
జూచి మరల లేచును]

నాయకుఁడు—(ఆమె యుత్తరీయమును బట్టి)

కమ్రకలకంఠి! కరభోరు! కమలవదన!
నిబిడకుచ! విపులజఘన! నిమ్ననాభి!

కలకంఠి! కమలవదనే!
చకితచకోరాక్షి! కిం ప్రయాసేన.

[ఇతి పునరపి నివేశయతి]

శ్రీవత్సః—హంత! పక్ఖవాఅఉత్తిణో రణ్ణో సణ్ణిహాణే ఠా ఉం ణ జోగ్గం। జేణ సిట్ఠబంహ్మణేక్క-విద్దేసిణీ దుట్ఠ దాసిఆ పిఅసహి త్తి సంభావిజ్జఇ। కింఅ తాఏ ఏవ్వ ఉవదేసో అణుచిట్ఠీఅది. (హంత! పక్షపాతవర్తినో రాజ్ఞః సన్నిధానే స్థాతుం నయోగ్యమ్. యేన శిష్ట బ్రాహ్మణైక విద్వేషిణీ దుష్టదాసికా ప్రియసఖీతి సంభావ్యతే. కించ తస్యా ఏవోపదేశ అనుష్ఠీయతే.)

[ఇతి ససంభ్రమ మపసరతి.]

చంద్రలేఖా—తదభిప్పఆహి భో సిట్ఠ బహ్మణ! మే అక్ఖ మేసు అవిణఅక్క-మేసు. (తదభిప్రయాహి భో శిష్ట బ్రాహ్మణ! మేఽక్షమేష్వవినయక్రమేషు.)

(ఇత్యనుసరతి।)

శ్రీవత్సః—హండే! రచ్ఛారదే! ఏహి ఏహి! దేవీఏ సచ్చ భామాఏ ఏవ్వ సంముహం ఆళేచ్ఛామి. (హండే! రథ్యా రతే! ఏహ్యేహి. దేవ్యాసత్యభామాయా ఏవ సమ్ముఖ మాలక్షయామి.)

[ఇతి శిఖాం ముహుర్నిబధ్నన్ నిష్క్రాంతః.]

చంద్రలేఖా—అయ్య! సిరివచ్ఛ! పసీద. (ఆర్య! శ్రీవత్స! ప్రసీద.)

కుటిలకుంతల! చకితచకోరనయన!
బేల! తనుమధ్య! యాయాసమేల నీకు? 16.

(అని మరల నామెను గూర్చుండఁబెట్టును)

శ్రీవత్సుఁడు—ఇస్సీ! పక్షపాత వర్తియైన యీ రాజు సన్నిధిని నిలుచుట యోగ్యముకాదు. ఇతఁడు శిష్టబ్రాహ్మణైక విద్వేషిణియైన యీ దుష్టదాసిని బ్రియసఖ యని గారవించుచున్నాఁడు. అంతేకాక, దాని యుపదేశమునే యాచరించుచున్నాఁడు. (అని సంభ్ర

చంద్రలేఖ—ఓయీ! శిష్టబ్రాహ్మణా! నా[redacted]లు నీ కనిష్టములయినచో నీవు తొలఁగి పొమ్ము

(అని యతని ననుసరించును.)

శ్రీవత్సుఁడు—నీచురాలా! బజాఱీ! రమ్ము, రమ్ము. సత్యభామాదేవియెదుట నీ సంగతిఁ దెలిసికొందును.

(అని తన జుట్టు మరల మరల ముడిపెట్టుకొనుచుఁబోవును)

చంద్రలేఖ—ఆర్యా! శ్రీవత్సా! శాంతింపుము. (అని యతని వెంటఁబడి వెడలును.)

[ఇతి తమను నిర్గచ్ఛతి ।]

కువలయావళీ—హాళా! తుమం వి కిం మం పరిచ్చఅసి ।
(హాలా! త్వమపి కిం మాం పరిత్యజసి.)

[ఇత్యనుయాతుముత్తిష్ఠతి.)

నాయకః—ప్రియే కువలయావళి!

దత్తాసి ఘర్మకణికాజలధారయా మే
కామేన లోకగురుణా కరుణాకరేణ ।
పశ్యావయోరపి పరస్పరరాగబంధే
రాగాగ్ని రేవభగవానయమాదిసాక్షీ ౧౭.

[ఇతి చిబుకే ముఖమున్నమయతి ।]

కువలయావళీ—(ముఖమాకృష్య) భో! మా తుమం లఘూక
రేహి జణేసు. (భో! మా త్వం లఘూకురుష్వ జనేషు.)

[తతః ప్రవిశతి సత్యభామా చతురికాచ]

సత్యభామా—(స సౌభాగ్యగర్వమ్) హాళా! చఉరిఏ!

పరిఅరబలేన జంజం
అళం జుఅం తం తమణ్ణవేసాదో ।
ణవవేసా సురఅంతా
హోంతి హి రుఇఅసురఆరంభా ౧౮.

(హాలా! చతురికే!
పరికరబలేన యద్యదలం యుతం తత్ తదన్యవేషాత్ ।
నవవేషాః సురతాంతాః భవంతి హి రుచితసురతా
[రంభాః ॥)

కువలయావళి—చెలీ! నీవు నన్ను విడిచి పోయెదవా?

(అని యామె వెంటఁబోవుటకు లేచును)

నాయకుఁడు—ప్రియా! కువలయావళీ!

నాకుఁ గరుణాకరుండైన లోకగురుఁడు
స్వరుఁ డొసంగెను నిను ఘర్మసలిలధార
మన పరస్పరరాగసంబంధమునకుఁ
బ్రథమసాక్షి రాగాగ్నిదేవతయె చూవె. 17.

(అని చిబుకమునుబట్టి ముఖమునెత్తును)

కువలయావళి—(ముఖము వెనుకకు లాగికొని)

ఆర్యా! నన్ను నలుగురిలోను జులుకఁజేయకుఁడు

(చూ. అను. పాట 9)

[సత్యభామయుఁ జతురికయుఁ బ్రవేశింతురు]

సత్యభామ—(సౌభాగ్యగర్వముతో) చెలీ! చతురికా!

పరికర బలయుత మయినది
సరియైతగు నవ్యవేషసంపద దనరన్
నెరనవవేషములు రుచిత
సురతారంభములు వెలయు సురతాంతములై. 18.

చతురికా—భట్టిణి! ణ ఖు సవ్వావి ఇత్థిఆ సచ్చభామా ణ ఖు సవ్వో వి పురుసో పురుసోత్తమో! (భట్టిని! న ఖలు సర్వాపి స్త్రీ సత్యభామా సర్వోఽపి పురుషః పురుషోత్తమః.)

సత్యభామా—(సాదరస్మితమ్) హాళా! కదళీఆఘరసమీవమ్మి అయ్యఉత్తో దిట్ఠో త్తి కఏ ఆచక్ఖిదం. (హలా! కదలికా గృహసమీపం ఆర్యపుత్రో దృష్ట ఇతి కయాఖ్యాతమ్?)

చతురికా—భట్టిణి! విళాసుజ్జాణపాళిఆఏ కళకంఠిఆఏ(భట్టిని! విలాసోద్యాన పాలికయా కలకంఠికయా.)

సత్యభామా—హాళా! అవిణ్ణాదా పసంగంతరేణ పవిట్ఠా అళీ అరోసచ్ఛళేణ భట్టిణా కేళిస్సం. (హలా! అవిజ్ఞాతా ప్రసంగాంతరేణ ప్రవిష్టాలీకరోషచ్ఛలేన భర్త్రా క్రీడిష్యామి)

చతురికా—ఇదం ఖు విళాసుజ్జాణం. (ఇదం ఖలు విలాసోద్యానమ్)

[ఉభే ప్రవిశతః]

చతురికా.—భట్టిణి! పేచ్ఛసో అజ్జస్స కఏ ఉ బళంమి తువ పదక్కమణే భట్టార ఆవరాహే కేసళకణ్ణుప్పళేణ రఇదా సిక్ఖా. (భట్టిని! ప్రేయస ఆర్యస్యకృతేతు బలాత్ తవ పదక్రమణే భట్టారకాపరాధే కేసరకర్ణోత్పలేన రచితా శిక్షా.)

సత్యభామా—(సస్మితమ్) తా అపురువం ఖు కదళీఆఘరం. (తదపూర్వంఖలు కదలికాగృహమ్)

చతురికా—అఅం ఖు భట్టిణో సమాళావో సుణీఅది. (అయం ఖలు భర్తుః సమాలాపః శ్రూయతే.)

చతురిక—అమ్మా! స్త్రీలందఱును సత్యభామలుకారు; పురుషు లందఱును పురుషోత్తములు కారు.

సత్యభామ—(ఆదరస్మితముతో) చెలీ! ఆర్యపుత్త్రుఁడు కదళికా గృహ సమీపమునఁగనఁబడెనని నీ కెవరు చెప్పిరి?

చతురిక—భట్టినీ! విలాసోద్యానపాలికయైన కలకంఠిక.

సత్యభామ—చెలీ! బయలుపడకుండ వేఱొక ప్రసంగమెత్తికొని యలీకరోష వ్యాజమున భర్తతో వినోదించెదను.

చతురిక—ఇదియే విలాసోద్యానము

[ఇరువురును బ్రవేశింతురు]

చతురిక—భట్టినీ! ప్రియభర్తయెడల భట్టారకాపరాధము గావించిన నీ పదక్రమణమందు కేసర కర్ణోత్పలముచే బలముగా శిక్షరచితమయినది.

సత్యభామ—(చిఱునవ్వుతో) ఆ కదళీగృహ మపూర్వము సుమా.

చతురిక—అదిగోఁ బ్రభువుల సంభాషణము వినఁబడుచున్నది.

సత్యభామా—తా అణాళక్ఖిద్దా ఆఅణ్ణేమి పసంగం. (తదనాలక్షితాకర్ణయామి ప్రసంగమ్.) (తథా కృత్వా, ఉభే కువలయావలీం విలోకయతః।)

చతురికా—భట్టిణి! కిం వి ఏత్థ అణ్ణవ్వ వట్టది. (భట్టిని! కిమప్యత్రాన్యదివ వర్తతే.)

సత్యభామా—హాళా! అవిస్ససణిజ్జో ఖు ఏసో! (హాలా! అవిశ్వసనీయః ఖల్వేషః

నాయకః—(సానునయమ్)

విటపవతీ కిసలయినీ
మంజరితా తన్వి! తనులతా సేయమ్।
ఫలమేవ కటాక్షస్తవ
మామనుజానీహి కిం విలంబేన? ౧౯

[ఇతి ముఖమున్నమయతి]

కువలయావళీ—భో! ముంచ అవిణఅం రక్ఖేహి. (భో! ముంచా వినయం రక్ష.)

సత్యభామా — (సహాసోపసృత్య) భో! దారిఏ!కణ్ణఆకాముఅస్స ఇమస్స మహారాఅస్స అణుణఅం కాదూణ తుమం విణఅం రక్ఖేహి. (భోదారికే! కన్యకాకాముకస్యాస్య మహారాజస్యానునయం కృత్వా త్వం వినయం రక్ష.)

నాయకః—(సాశంకం నాయికాం విసృజతి)

కువలయావళీ — (సభయమపసరంతీ లతాంతరితా దిశోఽవలోకయతి)

సత్యభామ—అట్టులైనచో నేను గుర్తింపఁబడకుండ డాఁగి యీ ప్రసంగము నా కర్ణించెదను.

[అట్లునేసి యిరువురును గువలయావళిని జూతురు]

చతురిక—భట్టినీ! అక్కడనేదో మఱియొకటి యున్నట్టున్నది.

సత్యభామ—చెలీ! ఇతఁ డవిశ్వసనీయుఁడు సుమా.

నాయకుఁడు—(అనునయముతో) (చూ. అను. పాట 10)

కొమ్మ! నీ తనూలత లేఁత కొమ్మలను జి
వుళ్లఁ గుసుమగుచ్ఛములను బొలుపుమీఱు,
నీ కటాక్షమే ఫల మది నా కొసంగు
మింకను విలంబమును జేయనేల? తన్వి! 19

[అని ముఖము నెత్తును]

కువలయావళి—ఆర్యా! అవినయము వలదు; రక్షింపుఁడు.

సత్యభామ—(తటాలునఁ బ్రవేశించి) అమ్మాయీ! కన్యకా కాముకుఁడైన యీ మహారాజు ననునయించి, నీ వినయమును రక్షించుకొనుము.

నాయకుఁడు—(జంకుతో నాయికను విడుచును)

కువలయావళి—(భయమునం దొలఁగి లతల చాటునకుఁ బోయి దిక్కులు చూచుచుండును.)

[ప్రవిశ్య]

చంద్రలేఖా—సఖీమాలింగ్య) కిం త్తి తుహ తణులదా వేవఇ· (కిమితి తవ తనులతా వేపతే?)

కువలయావళీ—(కథంచిద్ ప్రకృతి ముపగమ్య) హళా! సచ్చ భామాఏ దిట్ఠ చావళమ్హి. (హలా! సత్యభామయా దృష్ట చాపలాస్మి.)

చంద్రలేఖా—(సశంకమ్) కుదో ఖు ఇఅం ఆగదా అణబ్భ వజ్జ విట్ఠీ। తా ఏహి అబ్భంతరం గచ్ఛామో. (కుతః ఖల్వియ మాగతానభ్ర వజ్రవృష్టిః? తదేహ్యాభ్యంతరం గచ్ఛావః)

(ఇతి సఖీం హస్తే గృహీత్వా నిష్క్రాన్తా.)

నాయకః—(సాంజలిపుటమ్)

ఆగో నాస్తీతి వచో
బాధితమస్తీతి దాసతానుచితమ్
పాపీతి సిద్ధసాధన
మధునా దేవీ ప్రమాణ మాచిత్యే. ౨౦.

సత్యభామా—మహారాఅస్స ఓసరం అజాణిఅ విస్సంభభంగ కారిణీ అహం అఉఇదకమ్మం ణ జాణామి. (మహారాజ స్యావసరమజ్ఞాత్వా విస్రంభ భంగకారిణ్యహం చో చితకర్మన జానామి.)

నాయకః—(ఆత్మగతమ్) హంత! శ్రీ వత్సో ఽ పి నాత్రసన్ని హితః।

[ప్రవిశ్య]

శ్రీవత్సః—(సనిర్వేదమ్) అహ్మో! మందబుద్ధిణో విస్మారణసీ లత్తణం మజ్ఝ। జం ణలకిఅ (?) కిసళఅత్తిదహాదఏణ దేట్ఠ

[ప్రవేశించి]

చంద్రలేఖ—(సఖిని గౌఁగిలించుకొని) ఏమిది? నీ తనూలత వడఁకుచున్న దేమి?

కువలయావళి—(ఎట్టకేలకుఁ దన సహజస్థితి నొంది) చెలీ! సత్యభామ నా చిత్త చాపల్యమును గనుఁగొన్నది.

చంద్రలేఖ—(భయముతో) ఎక్కడనుండి యీ మబ్బులులేని పిడుగువాన వచ్చినదో కదా! పద, లోనికిఁ బోవుదము.

(అని చెలిచేయిపట్టుకొని వెడలును.)

నాయకుఁడు—(చేతులు జోడించి)

తప్పు లే దన్న నయ్యది యొప్పనిదగు,
నున్న దను పల్కు దాసతానుచిత మగును;
బాపి నన సిద్ధసాధనంబ యగుఁ; గాన,
నిప్పు డౌచితికిఁ బ్రమాణ మీవె దేవి ॥ 20.

సత్యభామ—మహారాజుగారి సమయము దెలిసికొనక విస్రంభ భంగ మొనరించిన దానను; ఉచితమైన కార్య మేదియో నాకు మాత్రమేమి తెలియును?

(చూ. అను. పాట 11)

నాయకుఁడు—(తనలో) అయ్యో! శ్రీ వత్సుఁ డయినను దగ్గఱ లేఁడుగదా.

[ప్రవేశించి]

శ్రీవత్సుఁడు—(విచారముతో) అయ్యో! మంద బుద్ధినయిన నా మఱపు! చివురులోని పాడు తేనెటీఁగ వ్రేలు కుట్టుట

గ్గుళిఅవేలఅణా సచ్చభామా జో గమాఅమహూసవస్స ణ గదే త్తి ణో ణివేదిదం పిఅసహస్స। సో వి మత్తో కణ్ణఆ విస్సంభం కరేఇ। అహం గదుఅ అప్పమోదం ఉవదిసామి। (పరిక్రమ్య, సత్యభామాం విలోక్య సశంకమ్) అహ్మో! విస్సంభ విగ్ఘకారిణీ సా పుఢమం ఏవ్వ ఏత్థ సణ్ణిహిదా। తా ఇదో ఏవ్వ శణైః చిట్ఠామి. (అహో మందబుద్ధే ర్విస్మరణశీలత్వం మమ! యద్...కిసలయస్థిత హాతకేన దుష్టాంగులికవేదనా సత్యభామా యోగమాయామహోత్సవస్య న గతేతి నో నివేదితం ప్రియసఖస్య. సోఽపి మత్తః కన్యకావిస్రంభం కరోతి. అహం గత్వాఽప్రమోద ముప దిశామి. అహోవిస్రంభ విఘ్నకారిణీ సా ప్రథమేవాత్ర సన్నిహితా. తదిత ఏవ శనై స్తిష్ఠామి.)

నాయకః—(సత్యభామాం హస్తే గృహీత్వా)

సాపరాధే చ దండ్యే చ
పురతో మయి తిష్ఠతి ।
ప్రభవంత్యపి కిం రోషం
విధత్సే ధీరమానసే. —౨౧.

అథవా శ్రూయతామ్—

బద్ధే భ్రూయుగళే విభంగకుటిలం బద్ధోఽస్మి వేగోత్థితై
ర్నిశ్వాసై రభితాడితేఽధరపుటే సంతాడితోఽస్మి ప్రియే!,
కల్హారేఽరుణయా దృశా శ్రుతిసఖే రుద్ధే నిరుద్ధోఽస్మిమాం
జానీథాస్తవ దండితం పరుషయా సఖ్యేవ కోపశ్రియా. —౨౨

చేత బాధపడుచు సత్యభామ యోగమాయా మహో త్సవమునకు పోలేదన్నవృత్తాంతము నా ప్రియసఖునకుఁ జెప్పకుంటిని. ఇతఁడును బ్రమత్తుఁడయి యీ కన్యతో విస్రంభవినోదమున నున్నాఁడు. నే నేఁగి జాగరూకత నుపదేశించెదను. (అని పరిక్రమించి, సత్యభామను జూచి, భయముతో) అయ్యో! విస్రంభ విఘ్నకారిణియగు నీమె యిక్కడికి నాకంటె ముందుగానే వచ్చియున్నదే! కావున నే నిక్కడనే కొంచెముసేపు నిలిచియుందును.

నాయకుఁడు—(సత్యభామచేయి పట్టుకొని)

సాపరాధుండ దండ్యుండ నైన నేను
నీ సమక్షమం దీ రీతి నిలిచి యుండ
శక్తియుత వయ్యు వట్టి రోషంబుఁ బూని
యేల యూరకుందువు? ధీర హృదయురాల! 21

కాదేని, వినుము:

వక్రంబుగా బొమల్ వంగి బద్ధంబు
లగునంత బద్ధుండ నైతినో యింతి;
వడిగొన్న నిట్టూర్పుబలముచే మోవి
తాడితం బయినయంతనె తాడితుండ;

[ఇతి పాదయోః పతితుమిచ్ఛతి]

సత్యభామా—(హస్తమాకృష్య సపరిజనా నిష్క్రాంతా.)

నాయకః—(సదైన్యనిఃశ్వాసమ్) నియతౌ ప్రతికూలాయాం కిన్ను పౌరుషేణ । తథాహి—

నాస్వాదితం తదధరామృత మంతికస్థం
దేవ్యాః కృతో మనసి విప్రియవజ్రలేపః,
సేయం సపత్నజనహస్తగతా చ ముగ్ధా
కష్టం పురః స్ఫురతి కల్మషకర్మపాకః. —౨౩.

శ్రీవత్సః—(శనైః శనైరుత్తిష్ఠన్నుపసృత్య) భో వఅస్స! జమ్మ ణక్ఖత్తోపసగ్గాదో విముక్కహ్మ. (భోవయస్య! జన్మనక్షత్రోపసర్గాద్ విముక్తాః స్మః.)

నాయకః—సఖే! మహోత్సవ ప్రతినివృత్తా దేవీ ప్రసంగ మిమమాకర్ణ్య కియత్ పీడయిష్యతి తవ ప్రియసఖీమితి పర్యాకులోఽస్మి.

శోణ దృక్కులచేత శ్రుతి సఖోత్పలము
రుద్ధమైనంత నే రుద్ధుండ నైతి;
నీ కోపలక్ష్మి నీ నెచ్చెలిం బోలి
పరుషమై దండించెఁ బరికింపు నన్ను. 22.

[అని యామె పాదములఁ బడఁ గోరును]

సత్యభామ—(తన హస్తమును లాగికొని పరిజనముతో నిష్క్రమించును) (చూ. అను. పాట 12)

నాయకుఁడు—(దైన్యముతో నిట్టూర్పు విడుచుచు) దైవము ప్రతికూల మయినప్పుడు పౌరుషమునలన నేమి ప్రయోజనము?

అక్లేమటే,—

ఆనఁగనైతి నామె యధరామృత మంతిక మందె [యుండినన్;
మానస మందొనర్చితిని మానిని కప్రియ వజ్రలేప; మె
ట్లైన సపత్నహస్తగత మైనది యీ సుకుమారి [ముగ్ధయుఁ;
గానఁగ నయ్యెఁ గట్టెదుటఁ గల్మషకర్మవిపాక మక్కటా॥

శ్రీవత్సుఁడు — (మెల్లగా లేచుచు సమీపించి) ఓహో! వయస్యా! మన జన్మనక్షత్రోత్పాతము చేత విముక్తుల మయినాము.

నాయకుఁడు—మిత్రమా! దేవి మహోత్సవమునుండి తిరిగి రాఁగానే యీ ప్రసంగము విని నీ ప్రియసఖి నెంతగా బాధించునో యని నేను వ్యాకులపడుచున్నాను.

శ్రీవత్సః—భోవఅస్స! భవంతం భావిణం అణుభవం (తేణ) ఏవ్వ పరిహారణిజ్జేత్తి ణివేదేమి ణో అణ్ణోత్తి। తా ఏహి సచ్చభామం అణుసరహ్మ. (భోవయస్య! భవంతం భావిన మనుభవత్రైవ పరిహారణీయేతి నివేదయామి నాన్యదితి. తదేహి సత్యభామా మను సరావః.)

నాయకః—ఏవమేవ కరణీయమిదానీమ్.

శ్రీవత్సః—ఇదో ఇదో పిలవలస్సో. (ఇత ఇతః ప్రియవయస్యః)

నాయకః—(సస్మరణమ్ ఆకాశే లక్ష్యం బద్ధ్వా) అయి! ప్రియే! కువలయావలి! తథా ఖలు,

కంటకకలికాన్వితయా
తరలితయా తవ లతాంగి! తనులతయా
నిష్కంటక మివ మన్యే
మమ రాజ్యం భాగధేయానామ్. ౨౪.

[ఇతి సవయస్యో నిష్క్రాంతః]

॥ తృతీయోఽంకః ॥

శ్రీవత్సుఁడు—వయస్యా! భవితవ్య మనుభవించినఁ గాని పరిహృతముగా దనుచున్నా నంతియే మఱియేమియు లేదు. కావున, సత్యభామ ననుసరింతము రమ్ము.

నాయకుఁడు—ఇప్పు డా పనియే చేయవలెను.

శ్రీవత్సుఁడు—ఇటు; ఇటు; ప్రియవయస్యా!

నాయకుఁడు—(ఏదియో స్మృతికిఁ దెచ్చుకొనుచు, నాకాశము వైపు లక్ష్యముంచి)

ఓహో! ప్రేయసీ! కువలయావళీ! అక్టే...

కంటకకలికాన్విత మయి కంప మొందు
నీ విమలతనూలతచేతనే మదీయ
భాగధేయరాజ్యం బెల్ల వనజనయన!
యింక నిష్కంటక మగు నం చెంతు నిపుడు ॥ 24.

[అని వయస్యునితో నిష్క్రమించును]

తృతీయాంకము సంపూర్ణము.

# అథ చతుర్థోఽంకః

[తతః ప్రవిశతి పరిచారికాద్వయమ్]

ఘన—హళా! కత్థూరిఏ! దేవీ జోగమాఆమహూసవాదో జదో పడిణివుత్తా తదో పహుది అకారణం వి పరిఅణం (?) కుప్పఇ, కిం కాళణమ్? (హలా! కస్తూరికే! దేవీ యోగ మాయా మహోత్సవాద్ యతః ప్రతినివృత్తా తతః ప్రభృత్యకారణమపి పరిజనాయ కుప్యతి; కిం కారణమ్?)

కస్తూరికా—హళా! ఘణసారిఏ! ణం చదురిఆముహాదో దేవీఏ పడిణ్ణావిదో కదళీఘరంమి భట్టిణో వుత్తంతో। (హలా! ఘనసారికే! నను చతురికాముఖాద్ దేవ్యై ప్రతి జ్ఞాపితః కదలీగృహే భర్తుర్వృత్తాన్తః)

ఘనసారికా—జుజ్జఇ। అహ కువళఆవళీఏ కో వుత్తంతో (యుజ్యతే! అథకువలయావల్యాః కో వృత్తాన్తః?)

కస్తూరికా—సా ఖు మహేసిణా పుణో వి తవోవణం ణీదేత్తి పవాదం కదుఅ అహ్మారిసజణస్స దుగ్గమంమి సత్తచ్ఛద పాసాఅసురంగాఘరఅంమ్మి ఠావిదా కుళకమాగదేణ విస్సాసిణా మాహవఉళపరిఅణేణ సద్దో రక్ఖిజ్జఇ। (సాఖలు మహర్షిణా పునరపి తపోవనం నీతేతి ప్రవాదం కృత్వాఽస్మాదృశజనస్య దుర్గమే సప్తచ్ఛద ప్రాసాదసురంగా గృహే స్థాపితా కులక్రమాగతేన విశ్వాసినా మాధవకుల పరిజనేన సద్యో రక్ష్య

# చతుర్థాంకము

(ఇరువురు పరిచారికలు ప్రవేశింతురు)

ఘనసారిక—చెలీ! కస్తూరికా! యోగమాయామహోత్సవమునుండి తిరిగి వచ్చినప్పటనుండియును దేవి నిష్కారణముగాఁ బరిజనముపైఁ గోపపడుచుండును. కారణమేమి?

కస్తూరిక—చెలీ! ఘనసారికా! కదళీగృహమందలి భర్తృవృత్తాంతము చతురికనోటనుండి దేవి తెలిసికొన్నదిగదా?

ఘనసారిక—ఔనౌను. అపిమ్మటఁ గువలయావళి వృత్తాంతమేమి?

కస్తూరిక—ఆమెను నారదమహర్షి మరలఁ దపోవనమునకుఁ దీసికొనిపోయెనన్న ప్రవాదము కలిగించి మన బోంట్లకు దుర్గమమైన సప్తచ్ఛదప్రాసాదమునఁ గల సురంగాగృహమం దుంచినది. కులక్రమాగతమై విశ్వసింపఁదగిన మాధవకులపరిజన మామె నిప్పుడు రక్షించుచున్నది.

ఘనసారిక—పురా ఖు ఏవ్వంసీళా ణ హొఇ దేవీ। దాణిం ఖు సచ్చభామాఏ ఉవదేసేణ దీహకోవణా అదిస్ససీలా అ సవ్వుత్తా। తహ గుణదోసా అ సంసగ్గదో సంకమంతి త్తి। (పురా ఖల్వేవంశీలా న భవతి దేవీ। ఇదానీం ఖలు సత్యభామాయా ఉపదేశేన దీర్ఘకోప నాదృశ్యశీలా చ సంవృత్తా। తథాగుణదోషాశ్చ సంసర్గతః సంక్రామన్తీతి।)

కస్తూరికా—హళా! మహాదేవిం రుక్మిణిం లోఅమహిళాసామణ్ణం మణ్ణిఅ కిం ఏవ్వం భణాసి। (హలా! మహాదేవీం రుక్మిణీం లోకమహిలాసామాన్యం మత్వా కిమేవం భణసి?

ఘనసారికా—హళా! సఅళమహిళాసిళాహణిజ్జస్స బంధుజణ విసజ్జిదస్స దాక్షిణ్ణణిహిణో తారిసస్స కణ్ణఆరఅణస్స ఈరిసం ణిరోహం కరేఇ త్తి ఉమ్మణాఅమాణా ఏవ్వం భణామి। (హలా! సకలమహిలాశ్లాఘనీయస్య బంధుజన విసర్జితస్య దాక్షిణ్యనిధేస్తాదృశస్య కన్యకారత్నస్యే దృశం నిరోధం కరోతీత్యున్మనాయమానైవం భణామి।)

కస్తూరికా—కిం తుమం ణ ఆణాసి కువళఆవళీఏ ఉవరి దేవీ ఏవ్వ ణివ్విసేసం సిణేహం కరేఇ। కింతు దాణిం సవత్తి ఆజణదక్ఖిణ్ణం దువారికరిఅ తస్స పడిణ్ణాసఆరిణో మహేసిణో సా వి సజ్ఝసేణ తం కణ్ణఅం అదిప్పఆసేణ ఢక్కేఇ। (కిం త్వం న జానాసి కువలయావల్యా ఉపరి దేవ్యేవ నిర్విశేషం స్నేహం కరోతి। కిన్విదానీం సపత్నీ జవదాక్షిణ్యం ద్వారీకృత్య తస్య ప్రతిన్యాసకారిణో మహర్షేః సాపి సాధ్వసేన తాం కన్యకామతిప్రయాసేన ఛాదయతి।)

ఘనసారికా—హళా! జఇ మహేసీ అణుమణ్ణేఇ తా కువళఆవళీఏ మణోరహో ఫళిస్సది త్తి ణం తుమం జాణాసి।

ఘనసారిక—దేవి యిదివఱ కెన్నఁడు నిట్టి స్వభావము గలది కాదు. ఇప్పు డా సత్యభామ యుపదేశముచేత దీర్ఘకోప నయు నదృశ్యశీలయు నైనది. కావుననే గుణదోషములు సంసర్గముచేత సంక్రమించు నందురు.

కస్తూరిక—చెలీ! మహాదేవి యగు రుక్మిణిని లోకసామాన్య యగు స్త్రీగా భావించియా యిట్లు పలుకుచున్నావు?

ఘనసారిక—చెలీ! సకలమహిళా శ్లాఘనీయమును, బంధు విసర్జితమును, దాక్షిణ్యనిధియును నగునట్టి కన్యకారత్న మున కిట్టి నిరోధము కలిగించినదిగదా యను తహతహతో నిట్లనుచున్నాను.

కస్తూరిక—కువలయావళిపై దేవియే నిర్విశేషమయిన స్నేహము కలదియని నీకుఁ దెలియదా యేమి? అయినను, సపత్నీజన దాక్షిణ్యమాలోచించి తనయొద్ద నిల్లడవెట్టిన యా మహర్షి భయమువలన నా కన్య నతిప్రయాసముతో దాఁచు చున్నది.

ఘనసారిక—చెలీ! నారదమహర్షి యనుమతి యున్నచోఁ గువ లయావళి మనోరథము ఫలించునని నీ వెఱుఁగుదువుగదా?

(హలా! యది మహర్షిరను మన్యతే తర్హి కువలయా వల్యా మనోరథః ఫలిష్యతీతి నను త్వం జానాసి?)

కస్తూరికా—కో ఏత్థ సంసఓ। (కోఽత్ర సంశయః?)

ఘనసారికా—సా దక్ఖిణ్ణణిహీదుక్ఖసీలా ణివ్వుదా హోదు। (సాదాక్షిణ్య నిధిర్దుఃఖశీలా నిర్వృతాభవతు)

కస్తూరికా—తుఏ సుదం భట్టిణో కో ణు వుత్తంతో త్తి। (త్వయా శ్రుతం భర్తుః కోను వృత్తాన్త ఇతి?)

ఘనసారికా—హళా జహా బహ్వుముహాదో ఆఅణ్ణిదం తహాణివేదేమి। (హలా! యథా బభ్రుముఖాదాకర్ణితం తథా నివేదయామి) [సంస్కృతమాశ్రిత్య]

ఆస్తేపీశే క్షణమివ బహిర్మంత్రివృద్ధానురోధాద్
ధత్తే హేలాం పరిజనచోవిక్రియాసు క్రియాసు
నేచ్ఛత్యంతఃపురపరిచయం రాజకార్యాపదేశాత్
తస్యాః ప్రేమ్ణా తరళితధృతిశ్చక్రవర్తీ యదూనామ్. ౧.

కస్తూరికా—(హస్తమురసి కృత్వా) అహ్మో బళిఅం ఖు పేమ్మబంధో భట్టారఅస్స(అహో బలవాన్ఖలు ప్రేమబంధో భట్టారకస్య)

ఘనసారికా—(విలోక్య) హళా! ఏసో ఖు అంతేఉరపరిఅణో ఇదో తదో ణిళీఅ ణిక్కంపో హోఇ। తా దేవిం ఉవచ్ఛందేదుం ఆఅదో భట్టేత్తి ఆసంకేమి। (హలా! ఏష ఖల్వన్తః పురపరిజన ఇతస్తతో నిలీయ నిష్కంపో భవతి। తద్ దేవీ ముపచ్ఛందయితు మాగతో భర్తేత్యాశంకే)

కస్తూరిక—అందుకు సందేహమేమి?

ఘనసారిక—(జాలితో) దాక్షిణ్యనిధియైన యా దీనురాలు సుఖపడుఁగాక!

కస్తూరిక—భర్తృ వృత్తాంత మేమయిన వింటివా?

ఘనసారిక—చెలీ! బభ్రుముఖునివలన విన్నది విన్నట్లుగాఁ దెలియఁజేసెదను.

అరుదై నిల్చి క్షణంబు పీఠమున వృద్ధామాత్య విజ్ఞప్తిచేఁ
బరివారాప్తవచో వికారకృతులన్ బాటించు హేలాగతిన్
అరయన్ గోరఁడు రాజకార్యమిషచే నంతఃపుర స్త్రీల నా
తరుణీప్రేమను జక్రవర్తి విగతస్థైర్యుండుగా నుండుటన్ 1.

కస్తూరిక—(గుండెపైఁ జేయివైచికొని) ఓహో! భట్టారకుని ప్రేమబంధము కడుబలముగా నున్నదిగదా!

ఘనసారిక—(చూచి) చెలీ! ఈ యంతఃపురపరిజన మిందందు డాఁగి కదలికలేకయున్నది. కావున, దేవిని బ్రతిమాలుకొనుటకు భట్టారకుఁడు వచ్చియుండునని యూహించుచున్నాను.

కస్తూరికా—తా ఏహి దేవీసమీావం గచ్ఛామో। (తదేహి దేవీసమీాపం గచ్ఛావః)

[ఇతి నిష్క్రాంతే।]

[ప్రవేశకః]

[తతః ప్రవిశతి నాయకో విదూషకశ్చ।]

నాయకః—(సానురాగనిర్వేదమ్)

అద్య శ్వో భవితా సమాగమ ఇతి ప్రేమోత్తరం తామ్యతో
రత్యంతే విజనేకుతశ్చన ముహుర్విశ్లిష్యతోర్విఘ్నతః।
వైక్లబ్యం వహతోః సుహృజ్జనసమాశ్వాసైకజీవాశయో
ర్యూనోర్యాన్నమియం మనోరథమయీా మాయా మహీయా

[సికా ౨.

శ్రీవత్సః—భో వ అస్స కత్థూరిఆవ ణాసే వి ణాహిచమ్మ ణ ముంచేసి। జం ణారవణ ణీదాఏ కువళఆవళీఏ తుహ చిత్తస్స ఉకకంఠ భరో తారిసోఏవ్వ। (భో వయస్య! కస్తూరికాయా నాశేఽపి నాభిచర్మ న ముంచసి। యద్ నారదేన నీతాయాం కువలయావల్యాం తవ చిత్తస్యోత్కంఠాభరస్తాదృశ ఏవ)

నాయకః — (అశ్రుతిమభినీయ)

సలీలే ధమ్మిల్లే దరదలితకల్హారకలికాం
కపోలే సోత్కంపం మృగమదమయీాం పత్రలతికామ్।
కుచాభోగే కుర్వన్ లలితమకరీం కుంకుమమయీాం
కదా ను క్రీడేయం చకితహరిణీచంచలదృశా 3.

కస్తూరిక—అయినచో దేవీసమీపమునకుఁ బోవుదము రమ్ము.

[అని నిష్క్రమింతురు]

ప్ర వే శ క ము

[నాయకుఁడును, విదూషకుఁడును బ్రవేశింతురు]

నాయకుఁడు—(అనురాగ విషాదములతో)

రేవోమాహా సమాగమం బనుమతిఁ బ్రేమోత్తరోద్వేగులై
ప్రాపై యొప్పెడు నిర్జనస్థలి నెటో ప్రత్యూహవిశ్లేషముల్
ప్రాపింపఁ బగలఁ సుహృజ్జనసమాశ్వాసైకజీవాశులై
సైఁపఁ జాలెదునాత్మ యావనులవాంఛామాయలా యాసికల్ 2

శ్రీవత్సుఁడు—ఓహో! వయస్యా! కస్తూరిపోయినను నాభిచర్మమును విడువకున్నావు. నారదుఁడా కువలయావళిని దీసికొనిపోయెను. అయినను నామెయెడల నీ చిత్తమునకుఁ గల యుత్కంఠాభరమట్లే యున్నదిగదా!

నాయకుఁడు—(విననియట్లభినయించుచు)

అరవిరిమైన చెంగలువ నయ్యలివేణి బెడంగు వేనలిఁ
జెరివి, వడంకుచుఁ వనిత చెక్కులఁ గస్తురిపత్రవల్లరిన్
బరగనొనర్చుచున్ మకరిపత్రము కుంకుమతోఁ గుచస్థలిన్
నెరపుచు నెప్డు భీతహరిణేక్షణతో విహరింతునో కదా! 3.

శ్రీవత్స:—భో వఅస్స! అజ్జ ఏవ్వ ఖు సో తావసదుద్దురూటో తం కణ్ణఅం ఘేత్తూణ తవోవణం పవిట్ఠో। తా ఏహి సిగ్ఘజవమహాజంఘువాహేణ రహేణ తం అణుసరామో। (భో వయస్య! అద్యైవ ఖలు స తాపసదుర్ధురూటస్తాం కన్యకాం గృహీత్వా తపోవనం ప్రవిష్టః। తదేహి శీఘ్రజవ మహాజంఘువాహేన రథేన తమనుసరావః).

నాయకః—(సనిఃశ్వాసమ్) కిమనుసృత్య కరణీయమస్మాభిః ?

శ్రీవత్సః—(ససంరంభమ్) అహం తేణ దండాదండి బాహా బహావి అ జుజ్ఝిస్సం। బహ్మణభీరుఓ తుమం తం కణ్ణఅం జఅసిరిం విఅ సందణే ఠావిఊణ దువారవదిం ఆ అచ్ఛేహి। (అహం తేన దండాదండి బాహూబాహవి చ యోత్స్యే। బ్రాహ్మణభీరుస్త్వం తాం కన్యకాం జయశ్రియమివ స్యందనే స్థాపయిత్వా ద్వారవతీమాగచ్ఛ).

నాయకః—సఖే! నూనమిహాగతో భగవాన్ మామదృష్ట్వాభివర్తతే ఇతి తదిదం ప్రవాదమాత్రమేవేతి తర్కయామి।

శ్రీవత్సః—ణు దేవీఏ వసం గదాణం సవ్వం వి విదిదం హోది। (నను దేవ్యా వశం గతానాం సర్వమపి విదితం భవతి).

[ఇత్యుభౌ పరిక్రామతః।]

[నేపథ్యే కలకలః।]

శ్రీవత్సః—భో తువరేహి తువరేహి। జం ణారఅసిస్సవగ్గో తుమం అకఖందఇ, తదో తం బంహ్మణం ఘూఇ ఊణ

శ్రీవత్సుఁడు—వయస్యా! ఇప్పుడే యీ నాస్తికతాపసుఁ డా కన్యను దోడ్కొని తపోవనము ప్రవేశించెను గావున, జవనాశ్వములు పూన్చిన రథమెక్కి వానిని వెంబడింతము రము.

నాయకుఁడు—(నిట్టూర్పుతో) వెంబడించి మనము చేయవలసిన దేమి?

శ్రీవత్సుఁడు—(సంభ్రమముతో) నే నాతనితో దండాదండి బాహూబాహవి యుద్ధముచేసెదను. బ్రాహ్మణ భీరువైన నీవు జయలక్ష్మినివలె నా కన్యను రథముపైఁ గూర్చుండఁ బెట్టుకొని ద్వారవతికి రమ్ము.

నాయకుఁడు—మిత్రమా! ఆ మహర్షి యిచ్చటికివచ్చి నన్ను జూడకుండ వెడలెననుమాట నిక్కముగాఁ బ్రవాదమాత్ర మే యని నాయూహ.

శ్రీవత్సుఁడు—అట్లయిన దేవీవశవర్తుల కంతయుఁ దెలిసియుం డును గదా?

[అని యిరువురును బరిక్రమింతురు]

[తెరలోఁగలకలము]

శ్రీవత్సుఁడు—మిత్రమా! త్వరపడుము; త్వరపడుము. నారద శిష్యవర్గము నీకై మొఱలిడ్డుచున్నది. దీనినిబట్టి రాక్షసుఁ

కో వి రక్ఖసో కువళఆవళిం అవహారిస్సది త్తి తక్కేమి। (భో త్వరస్వ త్వరస్వ । యన్మారదశిష్యవర్గస్త్వామాక్ర న్దతి । తతస్తం బ్రాహ్మణం హత్వా కోఽపి రాక్షసః కువల యావలీమపహరిష్యతీతి తర్కయామి).

నాయకః—విహ్వాలోభయపరిభ్రాంతబుద్ధిరాలపస్యసంబద్ధమ్ । నను సప్తచ్ఛదప్రాసాదపరిసరే ఖల్వయం పరిజనస్యా క్రందః । తదేహి కిన్నిమిత్త ఇత్యవబోధయామః ।

[తతః ప్రవిశతి పరిభ్రాంతపరిజనా విషణ్ణా రుక్మిణీ.]

రుక్మిణీ—(సనిర్వేదమ్) హళా ! సుగంధిఏ ! అప్పణో ఉవే క్ఖాదో సాధుబందీకఆఏ కువళఆవళీఏ హంత రుక్కిణీ పరి అణ ఘాదిణీ ణిస్సంసఅ త్తి లోఅవాదే ణిమగ్గమ్హి । తా కళంకపంకిళేణ కిం అప్పణో జీవిదేణ । విణ్ణవేహి అప్పణో వవసాఅం అయ్యఉత్తస్స । (హలా ! సుగం ధికే ! ఆత్మన ఉపేక్షాతః సాధుబందీకృతయా కువలయా వల్యా హన్త రుక్మిణీ పరిజనఘాతినీ నిస్సంశయమితి లోకవాదే నిమగ్నాస్మి । తత్ కలంకపంకిలేన కిమాత్మనో జీవితేన ? విజ్ఞాపయాత్మనో వ్యవసాయమార్యపుత్రస్య).

సుగంధికా:—భట్టిణి ! అక్ఖ త్తి ఏవ్వ కిం అహీరా హోసి । జం గురుఅణురాఅణిచ్చళేహిం లోఅణేహిం పులోఅంతం భట్టారఅం ఇదో ఆఅచ్ఛంతం ణ పేచ్ఛసి । (భట్టిని! అక్షత్రియేవ కిమధీరా భవసి ? యద్ గురుకాను రాగ నిశ్చలాభ్యాం లోచనాభ్యాం పశ్యంతం భట్టారక మిత ఆగచ్ఛన్తం న పశ్యసి).

డెవఁడో యా బ్రాహ్మణుని జంపి కువలయావళి నపహరించి యుండునని నా యూహ.

నాయకుఁడు—భయముచేత మతిభ్రాంతి గలిగి బెగ్గడిల్లుచు న సంబద్ధము లాడుచున్నావు. ఆ పరిజనాక్రందనము సప్తచ్ఛద ప్రాసాద పరిసరమందుగదా? కావున రమ్ము; కారణమేమో తెలిసికొందము.

[పరిభ్రాంతపరిజనముతో రుక్మిణిప్రవేశించును]

(చూ. అను. పాట 13)

రుక్మిణి—(విచారముతో) చెలీ! సుగంధికా! అయ్యయ్యో! నా యుపేక్షామూలమునఁ గువలయావళి బందీకృతయగుట చేత రుక్మిణి నిక్కముగాఁ బరిజనఘాతిని యను లోకనిందకు నేను గుఱియైతినిగదా! అందుచేఁ గళంకపంకిలమైన జీవిత మింక నాకేల? నా సంకల్పము నార్యపుత్రునకు విన్న వింపుము.

సుగంధిక — భట్టినీ! క్షత్రియేతరవలె నధీరవగుచున్నావేమి? అనురాగాతిశయముగల కనుఁగవతో నిన్ను జూచుచు నిక్క డికి వచ్చుచున్న భట్టారకుని జూడకున్నావేమి?

రుక్మిణీ—(విలోక్య సగద్గదమ్) అయ్యఉత్త ! పరిత్తాఏహి పరిత్తాఏహి । (ఆర్యపుత్ర! పరిత్రాయస్వ పరిత్రాయస్వ).

నాయక—(సాదరముపసృత్య) అయి విదర్భరాజనందనే మహాదేవి !

మయి త్రాతరి పాతాల
భూతలస్వర్గవాసినామ్ ।
తవాజ్ఞాకరతాం ప్రాప్తే
కుతస్తే భీతిరాగతా ౮.

[రుక్మిణీ వ్యాహర్తు మిచ్ఛతి । వ్రీడవైలక్షణ్య మభినీయ సఖీమవలోకయతి ।]

సుగంధికా:—భట్టారఅ ! సత్తచ్ఛదప్పాసాదఅళిందే కువళయావళీ కేణ వి అణాళేక్ఖిదేణ గేహిదేత్తి వాఉళా దేవీ । (భట్టారక! సప్తచ్ఛద ప్రాసాదాలిన్దే కువలయావలీ కేనాప్యనాలక్షితేన గృహీతేతి వ్యాకులా దేవీ).

నాయకః—భో ప్రియే! కిమేతావతాపి పరిభ్రాంతాసి । సేయం కన్యకా తవ సమీప ఇతి చేతసి సమాధీయతామాశ్వాసః ।

[నేపథ్యే]

భో భో ద్వారవతీవాసిభిర్వీరమ్మన్యైః పురుషపలాశైః శ్రూయతామయం కాలయవనసోదరస్య మే వీరస్యాలాపః—

అంభోజినీమివ మదావలదంతలగ్నాం
మద్బాహుపంజరగతాం మదిరాయతాక్షీమ్.

రుక్మిణి—(చూచి గద్గదస్వరముతో) ఆర్యపుత్రా! రక్షింపుము; రక్షింపుము.

నాయకుఁడు — (ఆదరముతో సమీపించి) ఓ! విదర్భరాజ నందనా! మహాదేవీ!

స్వర్గమర్త్య రసాతలవాసులకును
త్రాతనైనట్టి నేను సంతతము నీదు
నాజ్ఞనొనరించుచుండ నో యతివమిన్న!
యుల్లమందింతగాఁ దల్లడిల్లనేల? 4.

[రుక్మిణి మాటాడఁగోరి సిగ్గుచే వైలక్షణ్య మభినయించి చెలి నవలోకించును.]

సుగంధిక—భట్టారకా! సప్తచ్ఛదప్రాసాదాళిందమున నుండిన కువలయావళి నెవఁడో యలక్షితుఁడై యపహరించెను; నందుచే దేవి మిక్కిలి వ్యాకులపడుచున్నది.

నాయకుఁడు—అయ్యో! ప్రేయసీ! ఈ మాత్రమునకే నీవు పరిభ్రాంత వయితివా? ఆ కన్య నీ సమీపమునందే యున్న దని భావించి యూరడిల్లుము.

[నేపథ్యమున]

ఓహో! ద్వారవతీవాసులారా! వీరులమను దురభిమానముతోనున్న పురుషాధములారా! కాలయవన సోదరుఁడనైన నా వీరాలాపములను వినుఁడు:

మత్తకరిదంత లగ్నకమలినివోలె
పంజరస్థ నీ మదిరనయన

యస్త్రాతు మిచ్ఛతి మదేన యదోః ప్రసూతా
సోఽయం సమేతు యది వా సకలాః సమేతాః. ౫.

నాయకః:—అహో! గర్వగ్రంథిబంధురం వచనమనాత్మ వేదినః కాలపాశవర్తినో దానవస్య!

శ్రీవత్సః—భో పిఅవఅస్సస్స దేవీసంరక్ఖణే అహం సజ్జిదో హోమి । తుమం మాఆవిరక్ఖసం అప్పమత్తో వావా దేహి । (భో ప్రియవయస్యస్య! దేవీసంరక్షణేఽహం సజ్జో భవామి। త్వం మాయావిరాక్షసమప్రమత్తో వ్యాపా దయ).

రుక్మిణీ:—హళా! గచ్ఛ తుమం అయ్యసచ్చవమ్మాణం ణివేదేదుం అయ్యఉత్తస్స వవసాఅం। (హలా! గచ్ఛ త్వమార్యసత్యవర్మాణం నివేదయితుమార్యపుత్రస్య వ్యవసాయమ్).

నాయకః—అయి ప్రియే! కిం న వీరసమరసమయజ్ఞాసి।
యదేకాకిని విరోధిని యదువీరసన్నాహమాదిశసి ।
పశ్య,

సిద్ధార్థఖండనవిధౌ కతివజ్రధారా
యోజ్యా భవంతి పరికూటితశైలకూటాః
చండాః పతంతి కతి వా కరికుంభకూట
పాటచ్చరా హరిపతేర్నఖకే చపేటాః.

[ఇతి ససంరంభం పరిక్రామన్ సుదర్శనానుధ్యానపరిగ్రహణ ప్రయోగానభినీయ సాశంకమవలోకయన్.]

మదముతోఁగావ వాంఛించు యదుజుఁడెవఁడొ
యతఁడు రావచ్చు; రావచ్చునందఱైన. 5.

నాయకుఁడు—తనను దానెఱుఁగక కాలపాశవశవర్తియై రాక్షసుఁడాడుమాట యెంత గర్వగ్రంథి బంధురముగా నున్నది?

శ్రీవత్సుఁడు—ఓ! ప్రియవయస్యా! దేవీ సంరక్షణమునకు నేను సిద్ధముగానున్నాను. నీ వప్రమత్తుఁడవై మాయావియైన యా రాక్షసుని సంహరించిరమ్ము.

రుక్మిణి—చెలీ! ఆర్యపుత్రుని యుద్యమము సత్యవర్మకు నివేదించుటకై నీవు వెడలుము.

నాయకుఁడు—ఏమీ! ప్రేయసీ! వీరసమరసమయము నెఱుఁగకున్నదానవు! ఏకాకినైయున్న పగతునిమీఁదికి యదువీరసన్నాహమున కాఙ్క్షనొసంగుచున్నావేల? చూడుము:

తతశైలాగ్రవిఘట్టనోద్యమలసత్ ప్రఖ్యాతవజ్రాయుధో
ద్ధతఘాతంబుల వెన్నిగావలయు సిద్ధార్థంబు ఖండింపఁగా?
నతిదృప్యన్మదకుంభికుంభదళనాభ్యాసంబుగన్నట్టి యు
న్నత పంచాస్యచపేటికల్ మశకముల్ జంపంగఁ బేర్కోటి
కిన్? 6.

(అని సంభ్రమముతోఁ బరికించుచు సుదర్శనానుధ్యాన పరిగ్రహణప్రయోగముల నభినయించి శంకతోఁజూచుచు)

చక్రం విలోక్య చటులాశనిఘోరధారం
ఖడ్గం దధాతి సహఖేటమసౌ నిశాటః ।

[సశంకావిషాదమ్]

అస్యాంసతో వికటపల్లవనే సితాంగీ
హా హంత హంత పతతీయమరాళకేశీ. ౭.

తదేనాం గగనభాగ ఏవ సమాలంబ్య విహ్వలాం తరళ తనుతరతరంగశీకరశిశిరగంధవాహే విలాసవనదీర్ఘికాతటే మందమవతారయామి । (ఇతి నిష్క్రాంతః ।)

[illegible] ! సిరివచ్ఛ! మాఆవిణో దాణవా । ఏఆఈ గదో అయ్యఉత్తో । ణ ఆణామి కిణ్ణు సోదవ్వం త్తి । (ఆర్య! శ్రీవత్స! మాయావినో దానవాః । ఏకాకీ గత ఆర్యపుత్రః । న జానామి కిన్ను శ్రోతవ్యమితి).

శ్రీవత్సః:—దేవి! సోహణం ఏవ్వ సుణీఅది । (దేవి! శోభన మేవ శ్రూయతే).

[ప్రవిశ్య]

నారదః:—(సహర్షమ్)

ఆద్వాపరోదయ ముపోషితయోర్మహర్ష్యో-
రస్మిన్ మహీమవతరత్యధునా ముకుందే ।
ఆశ్చర్యదాయిరణదశ్చ న పారణానాం
ప్రాప్తై రజీర్ణిరజనిష్ట జనిష్యతే చ. ౮.

అశనిఘోరధార మగు చక్రమును గాంచి
యా నిశాటుఁ డూనె నసియు డాలు

(శంకావిషాదములతో)

లూనమయిన యంత వాని మూపుననుండి
వ్రాలుచున్నదదె యరాళకేశి. 7

కావున, భయవిహ్వలయగు నామెను నే నంతరాళమందే పట్టుకొని తరలతనుతరతరంగముల తుంపరలచేఁ జల్లనైన తెమ్మెరలుగల యీ విలాసవనదీర్ఘికాతటమున మెల్లఁగా దింపెదను. (అని నిష్క్రమించును)

రుక్మిణి—ఆర్యా! శ్రీవత్సా! రాక్షసులు మాయావులు. ఆర్యపుత్రుఁ డేకాకియై వెడలెను. ఎట్టివార్త వినవలసివచ్చునో నాకుఁ దెలియకున్నది.

శ్రీవత్సుఁడు—దేవీ! శుభమునే వినియెదవు.

[నారదుఁడు ప్రవేశించును]

నారదుఁడు—(సంతోషముతో)

ద్వాపరం బాదిగా నుపవాసమున్న
నా కనుల కిపుడు హరి యనంత వెలయు,
నద్భుతాపహరణ పారణాప్తివలనఁ
గలిగిన దజీర్ణ మింకను గలుగఁగలదు. 8.

(విలోక్య) ఇమామేవ పురస్కృత్య శేషం సంపాదయామి । (ఉపసృత్య) మహాదేవి! వర్ధసే పత్యుర్విజయేన । శ్రూయతామ్—

సురాః సప్తాబ్ధిపూరాభం
యమైక్షన్త మహోదరమ్ ।
చక్రధారాగ్నినా సర్పి
ర్బిందుశేషం స శోషితః.

రుక్మిణీ:—(ససంభ్రమహర్షం నారదస్య పాదయోః ప్రణమ్య) భఅవదో పసాదేణ ఉజ్జీవిదహ్మి । (భగవతః ప్రసాదేనోజ్జీవితాస్మి).

శ్రీవత్స:—(స్వోత్తరీయం వీజయన్) హీ ! హీ ! ణిజ్జిదం పిఅవఅస్సేణ । ఫలిదం అహ్మాణం భాఅహేఏణ । (ఇతి నర్తిత్వా సవినయమ్) భఅవం! సిరివచ్ఛో సఅణ్ణపంసం దువే వారే తుజ్ఝ సిరిచరణే అహివాదేఇ । (హీ ! హీ । నిర్జితం ప్రియవయస్యేన । ఫలితమస్మాకం భాగధేయేన ! భగవన్ ! శ్రీవత్సః సకర్ణస్పర్శం ద్వే వారే తవ శ్రీచరణావభివాదయతి).

నారద:—(సస్మితమ్) ఏవమేవ ముదితో భూయాః ।

రుక్మిణీ:—భఅవం కిం అక్ఖదసరీరా వా మే వచ్ఛా కువళఆవళీ । (భగవన్! కి మక్షతశరీరా వా మే వత్సా కువలయావలీ?)

నారదః—దేవి! యస్యామేవం తవాదరో నిసర్గసిద్ధస్తస్యాః కిముచ్యతే కుశలసంపత్తిః

(చూచి) ఈమెనే పురస్కరించుకొని మిగిలినది నెఱవేర్చు కొనియెదను. (సమీపించి) మహాదేవీ! భర్తృవిజయముచే వర్ధిల్లుచున్నదానవు. వినుము:

అపుడు సప్తాబ్ధిపూరాభుఁ డయినయట్టి
యే మహోదరు సురలు వీక్షించినారొ
యతఁ డిపుడు చక్రధారాగ్ని ఘృతకణంబు
వోలె శోషితుఁడయ్యెనో! పూజ్యరాల! 9.

రుక్మిణి—(సంభ్రమహర్షములతో నారదుని పాదములకుఁ బ్రణమిల్లి) భగవానుని ప్రసాదముచే బ్రదికితిని.

శ్రీవత్సుఁడు—(తన యుత్తరీయమును విసరుచు) బళిబళీ! ప్రియవయస్యుఁడు విజయమందెను. మా యదృష్టము పండినది. (అని గంతులువైచి, వినయముతో) మహాత్మా! శ్రీవత్సుఁడు చెవులంటి నీ శ్రీచరణములకు రెండుసార్లు నమస్కరించుచున్నాఁడు.

నారదుఁడు—(చిఱునవ్వుతో) ఈరీతిగా సంతుష్టుఁడవు గమ్ము.

రుక్మిణి—మునివర్యా! నా బిడ్డ కువలయావళి యక్షతశరీరమై యున్నదిగదా?

నారదుఁడు—దేవీ! నీ కిట్టి స్వభావసిద్ధమైన యాదర మామెయం దుండఁగా నామె కుశలసంపత్తినిగూర్చి వేఱ చెప్పవలెనా?

రుక్మిణీ—దాణిం ఖు మే పుణ్ణం సంపుణ్ణం। (పరిజనం విలోక్య) తుమ్హే గచ్ఛహ అయ్యఉత్తస్స మంగళణీరాఅణసంపాదణస్స। (ఇదానీం ఖులు మే పుణ్యం సంపూర్ణమ్। యూయం గచ్ఛతార్యపుత్రస్య మంగలనీరాజన సంపాదనాయ)

పరిజనః—తహేతి (తథేతి) (నిష్క్రాంతః)

సుగంధికా—భఅవం దాణిం కహిం భట్టా। (భగవన్! ఇదానీం కుత్ర భర్తా?)

నారదః—అయం ఖలు విహ్వాలాం కువలయావళీ మాశ్వాసయన్ దీర్ఘికాతటే తిష్ఠతి।

సుగంధికా—భఅవం! కిం ఏత్థ గచ్ఛామో? (భగవన్! కిమత్ర గచ్ఛామః?)

నారదః—యదభిరుచితం మహాదేవ్యై। [పరాక్రమతి]

నారదః—(ఆత్మగతమ్) అయమేవావసరో దేవ్యై దివ్యస్యాస్య నివేదనాయ। (ప్రకాశమ్) పుత్రి వైదర్భి! కిమపి నివేదయితుమిచ్ఛామి!

రుక్మిణీ—భఅవం ఆణవేహి। (భగవన్! ఆజ్ఞాపయ)

నారదః—(జనాంతికమ్)

జానాసి లక్ష్మి! భగవచ్చరణారవింద—
సేవాసఖం వసుమతీం భగినీం పురా తే।
సైవాధునా త్వమివ దేవహితాయ ధాత్రా
సంప్రార్థితా కువలయావలిరావిరాసీత్ ౧౦.

రుక్మిణీ— కిణ్ణు ఏత్థ భఅవదో జుత్తం ఉత్తరం హుాదు?
(ప్రకాశమ్) హలా! తుమం ణివేదేహి సచ్చవాదిణీం

రుక్మిణి—ఇప్పుడు గదా నా పుణ్యము పూర్తిగా ఫలించినది! (పరిజనమును జూచి) ఆర్యపుత్రునికి మంగళ నీరాజనము సమకూర్చుటకు మీరు వెడలుఁడు.

పరిజనము—అట్లే (అని నిష్క్రమించును)

సుగంధిక—ఆర్యా! ప్రభువు లిప్పు డెచ్చటనున్నారు?

నారదుఁడు—భయవిహ్వాల యయిన కువలయావళిని నేద దేర్చుచు నతఁడు దీర్ఘికాతటమున నున్నాఁడు.

సుగంధిక—ఆర్యా! మన మచ్చటికిఁ బోవుదమా?

నారదుఁడు—మహాదేవి చిత్తము.

[అని పరిక్రమించును]

నారదుఁడు—(తనలో) ఈ దివ్యవిషయము మహాదేవికి నివేదించుట కిదియే సమయము. (ప్రకాశముగా) బిడ్డా! రుక్మిణి! ఏదోకొంచెము నివేదింపఁ గోరుచున్నాఁడను.

రుక్మిణి—మహాత్మా! ఆనతిండు.

నారదుఁడు—(జనాంతికముగా)

వసుధ హరిపాదపద్మ సేవాసఖ యని
యెఱుఁగవే తొల్లి నీ చెల్లెలే కద? యిపు
డామెయే దేవహితమున కజుఁడు వేఁడ
వెలసె నీవలెఁ గువలయావళి యనంగ. 10.

రుక్మిణి—(తనలో) ఈ పూజ్యునకేది తగిన ప్రత్యుత్తరము? (ప్రకాశముగా) చెలీ! నీవుపోయి సత్యవాదిను లగు చెల్లెం

భణిణిఆణం। జం మహోవఆరిణో అయ్యఉత్తస్స కంఠే వి ఉవఆరం పడిఅరేమి। ఏత్థ తుమ్హేహిం అణుమదీ కాదవ్వే త్తి। (కిం న్వత్ర భగవతో యుక్తముత్తరం భవతు? హలా! త్వం నివేదయ సత్యవాదినీనాం భగినికా నామ: యన్మహోపకారిణ ఆర్యపుత్రస్య కంఠేఽపి ఉపహారం ప్రతికరోమి। అత్ర యుష్మాభిరనుమతిః కర్తవ్యేతి)

సుగంధికా—జం దేవీ ఆణవేది త్తి। (యద్ దేవ్యాజ్ఞాపయతి)
(నిష్క్రాన్తా।)

నారదః—సాధు కల్యాణశీలే! సాధు!

కృతోపకారేషు జనేషు దేహినా—
మకుర్వతాం ప్రత్యుపకారమాదరాత్ ।
కిమింద్రసంపత్తివిశేషయా శ్రియా
కిమాయుషా కల్పశతానువర్తినా॥ ౧౧.

[తతః ప్రవిశతి విహ్వలా కువలయావళీ విమన్నో నాయకశ్చ]

నాయకః—కథమిదానీమపి న సమాశ్వసితి మే ప్రాణవల్లభా! తదేనాం కమలదలానీతశిశిరజలసేచనేన సమాశ్వాసయామి। (ఇతి కించిదన్తరం పరిక్రామతి। సమాకర్ణ్య సహర్షమ్) హంతేయం స్వయమేవ సమాశ్వస్తా, కిమపి మంత్రయతే। తదనాలక్షితోఽహ మాకర్ణయామి। (తథా కరోతి।)

కువలయావళీ—(పరితో విలోక్య) అమ్హో! ఇదం తం ఏవ్వ ఉజ్జాణం। (విచింత్య) జావ కో వి అణ్ణో ణ పేక్ఖఇ తావ

ద్రతో నిట్లు నివేదింపుము "మహోపకారి యగు నార్య పుత్రుని కంఠమునఁ బ్రత్యుపకృతిపూర్వకముగా నొక యుపహారము వేయఁ దలంచితిని; ఈ విషయమున మీ రందఱును ననుమతింపవలెను" అని.

సుగంధిక—చిత్తము; దేవి యానతిచ్చినట్లే (అని నిష్క్రమించును)

నారదుఁడు—సెబాసు! కళ్యాణీ! సెబాసు!

తమకు నుపకార మొనరించు ధార్మికులకు
సాదరముగఁ బ్రత్యుపకృతి సలుపనట్టి
వారి కింద్రసంపదమించు భాగ్యలక్ష్మి
కల్పశతజీవితము వృథాకాక యున్నె. 11.

[అంత భయ విహ్వాలయైన కువలయావళియు
విషణ్ణుఁ డయిన నాయకుఁడును బ్రవేశింతురు]

నాయకుఁడు—ఏమిది? నా ప్రాణవల్లభ యిప్పటికిని సేదదేఱ కున్నది! కావునఁ, గమలదళములతోఁ జల్లని నీరుదెచ్చి చల్లి సేదదేర్చెదను. (అని కొంచెము నడచిపోయి, చెవి యొగ్గి విని, సంతోషముతో) ఓహో! ఈమె తనంతఁ దానే తెప్పిఱిలి యేమియో మెల్లగాఁ బలుకుచున్నది. ఈమెకుఁ గనఁబడకుండ డాఁగి వినియెదను (అని యట్లు సేయును)

కువలయావళి—(నలుదెసలఁగలయఁ జూచి) అయ్యో! ఆ యుద్యానమే యిది; గావున, నితరులెవ్వరును జూడకుండ

ఇమాఏ దిగ్ఘిఆఏ ణిమజ్జఊణ అప్పాణం వావాదేమి। (ఇదం తదేవోద్యానమ్। యావత్ కోఽప్యన్యో న పశ్యతి తావ దస్యాం దీర్ఘికాయాం నిమజ్జ్యాత్మానం వ్యాపాదయామి) ఇతి శనైరుత్థాయ దీర్ఘికాముపసరతి।)

నాయకః—

పరస్పరానురాగాయ
వాసనాస్థాయినే నమః ।
యస్మిన్ ప్రాణపరిత్యాగ
దశాప్యుల్లాసకారిణీ ౧౨.

(ఇత్యనుపరిక్రామతి ।)

శ్రీవత్సః—ఇదం ఖు ఉజ్జాణం । పవిసంతు భవంతో । (ఇదం ఖలూద్యానమ్ । ప్రవిశన్తు భవన్తః).

[సర్వే ప్రవేశం నాటయంతి ।]

కువలయావలీ:—(సాంజలిబంధమ్)

అయి దిగ్ఘిఏ ణమో దే ।
పసీద పరిగణ్హ జీవిదం ఏదం ।
జహ మజ్ఝ ఆఉసేసో
సో రాఆ తేణ ణివ్వుదో హోదు ౧౩.

(అయిదీర్ఘికే! నమస్తే
ప్రసీద పరిగృహాణ జీవితమేతత్
యది మమాయుః శేషః
స రాజా తేన నిర్వృతో భవతు ॥)

(ఇతి ప్రవేష్టు మిచ్ఛతి ।)

నట్లుగా నీ దీర్ఘికలోమునిఁగి యాత్మహత్యగావించు కొని యెదను. (అని మెల్లఁగాలేచి దీర్ఘికను సమీపించును).

నాయకుఁడు—

దలఁపఁ బ్రాణ పరిత్యాగ దశయుఁగూడ
నెందు నుల్లాసకారియై యెసఁగుచుండు
నట్టి వాసనాస్థాయి కన్యోన్యమై త
నరెడు ననురాగమునకుఁ బ్రణతి యొనర్తు. 12.

(అని యామె ననుసరించును)

శ్రీవత్సుఁడు—ఇదియే యుద్యానము; ప్రవేశింపుఁడు.

[అందఱును బ్రవేశము నటింతురు]

కువలయావళి—(దోసిలియొగ్గి)

వందనము నీకు దీర్ఘికా యందుకొనుము;
చేకొనుము ప్రసన్నవయి నా జీవితమ్ము
నింక నాకు నాయుశ్శేష మేమియున్న
దాన నారాజు నిర్వృతుం డౌనుగాక! 13.

(అని దీర్ఘికలోఁబడఁ బోవును)

నాయకః—(తాం హస్తే గృహీత్వా)

అయి! త్వమేవం వ్యవసాయినీ ప్రియే!
కిమాయుషా మే భవతా చిరాదపి ।
కిమిందునా ధ్వంసితచంద్రికాశ్రియా
కిమింద్రనీలేన వినృష్టకాంతినా ॥ ౧౪ ॥

కించ,

నిర్విశ్లేషరథాంగమంబరగతావర్తం సరోజే సితం
నిశ్ఛిద్రం కరుణామృతం సురభిశైవాలం త్వదంగం సరః ।
గాహిత్వా పుటపాకమాకలయతే పశ్యైతదస్మన్మన
స్తద్ దీర్ఘాక్షి! న దీర్ఘికానిపతనం సంతాపనిర్వాపణమ్
౧౫

కువలయావలీ:—(నాయకం విలోక్య సహర్షలజ్జాసంభ్రమమ్ ఆత్మగతమ్) హంత! ఇమస్సిం ఓసరే మహాభాఓ ఏసో దిట్ఠో । (ప్రకాశమ్) భో! ముంచమం । ఏవ్వంకఆవిణఆ దేవీఆ ముహం పేక్ఖిదుం ణ సకుణోమి ।
(హన్త! అస్మిన్నవసరే మహాభాగ ఏవ దృష్టః। భో! ముంచ మామ్। ఏవం కృతావినయా దేవ్యా ముఖం ప్రేక్షితుం న శక్నోమి)

నాయక—యది ప్రియే తవాయం నిశ్చయః

నివార్యతే తతస్తస్మిన్
సాహసం చారుహాసిని !
మార్గప్రదర్శకం మన్యే
మామేనం మానశాలిని! ౧౬

నాయకుఁడు—(ఆమె హస్తములను బట్టుకొని)

ప్రేయసీ! నీవ యీరీతిఁ జేయుదేని
నింక నాకేల దీర్ఘాయు వీవులేక;
చంద్రికాలక్ష్మి పోయినఁ జంద్రుఁడేల?
నిగ్గు మాసిపోయిన నింద్ర నీలమేల? 14.

మఱియు,

వనజోపేత, మనిద్ర, మంబరగతా వర్తంబు, గారుణ్యాజీ
వన, మాశ్లిష్టరథాంగమున్ సురభిశైవాలంబునై యొప్పునీ
తను కాసారములో మునుంగుటను మత్ స్వాంతంబు చిచ్చుంట నీ
తను వీ డిగ్గియలో మునుంగుటను సంతాపంబు చల్లారునే? 15.

కువలయావళి—(నాయకుని జూచి హర్షలజ్జా సంభ్రమములతో తనలో) అయ్యో! ఇట్టి సమయమున నార్యపుత్రుఁడే కానవచ్చెనే! (ప్రకాశముగా) ఆర్యా! నన్ను విడువుము. ఇట్టి యవినయమును గావించి దేవి మొగము నే నెట్లు చూడఁగలను?

నాయకుఁడు—ప్రేయసీ! ఇదియే నీ నిశ్చయమైనచో—

చారుహాసినీ! యిదిగో నీ సాహసంపుఁ
గృత్య మిచ్చోటనే నివారించువాఁడ;
దానికై నేనకా మార్గదర్శకుఁడ న
టంచుఁ దలఁతునో! మానినీ! యాత్మలోన. 16.

తతః ఖలు

తా మ్రోదరేణ తరుణాంగులిపల్లవేన
వామేన తే కరతలేన కరం మదీయమ్ ।
ఆలంబ్య వాథ పునరుక్తిజితారవిందౌ
మందం నిధేహి చరణౌ మణికుట్టిమేషు ౧౭.

[ఇతి దత్తహస్తః పురస్తిష్ఠతి]

కువలయావళీ—(హస్తమాకృష్య) సంతం పావం; సంతం పావం! పడిహాదం అమంగళం; పడిహాదం అమంగళం। (శాంతం పాపమ్; శాంతం పాపమ్। ప్రతిహతమమంగలం; ప్రతిహతమమంగలమ్)

నాయకః — (సాకూతమ్) ప్రియే! దీర్ఘికాయామిదమేకమవలోక్యతామ్।

ఆచర్వణేన విరళీకృతకాండబంధం
చంచూపుటే సహచరేణ కృతం మృణాళమ్।
హాతుం గ్రహీతుమపి నేచ్ఛతి చక్రవాకీ
దత్తం మయాధరమివ త్వమధీరనేత్రే! ౧౮.

కువలయావళీ— సో వి ఏకో ధుత్తో। (సోఽప్యేకో ధూర్తః)

నాయకః—ప్రియే! కిమహమపరో ధూర్తః?

శ్రీవత్సః—(సోచ్చైఃస్వరమ్) ఇదో ఇదో దేవీ। (ఇత ఇతో దేవీ)

నాయకః—(సమాకర్ణ్య ఆత్మగతమ్) కథం వయస్యో నివేదయతి సంజ్ఞయా దేవీసమాగమనమ్! (ప్రకాశమ్) కోఽత్ర భోః నివేద్యతాం ప్రత్యాహ్వాతా కువలయావలీతి.

ఇంక నిదిగో—

తరుణకిసలోపమాంగుళి నరుణతలముఁ
గలుగు వామకరమున నా కరమునూఁత
గొనుచు నల్లనల్లన మణికుట్టిమములఁ
దమ్మియెఱుపును మీఱు పాదములనిడుము. 17.

(అని చేయి యందిచ్చి యెదుటనిలఁబడును)

కువలయావళి — (తనచేయి వెనుకకు లాగికొని) పాపము శాంతించుఁగాక! పాపము శాంతించుఁగాక! అమంగళము ప్రతిహతమగుఁగాక! అమంగళము ప్రతిహతమగుఁగాక! (అని వెనుక కొక యడుగు పెట్టి నిలుచును).

నాయకుఁడు—(ఆకూతముతో) ప్రేయసీ! దీర్ఘికలో నీ విశేషము చూడుము:—

తినుట కనువైనయట్లు చర్వణముచేసి
త్రోటిఁ దనజోడు తినఁబెట్టు తూఁటిముక్క-
వద్దనదు గైకొనదు చక్రవాకి; యిదిగొ
నేనొసంగెదు వాతెఱ నీవువోలె. 18.

కువలయావళి—అతఁడు నొక ధూర్తుఁడు.

నాయకుఁడు—ప్రేయసీ! ఏమి? నేను మఱియొకధూర్తుఁడనా?

(చూ. అను. పాట 14)

శ్రీవత్సుఁడు—ఇటు; ఇటు; దేవీ!

నాయకుఁడు—(విని, తనలో) ఓహో! దేవి వచ్చినట్లు సంజ్ఞ చేసి నా వయస్యుఁడు నా కెట్లు తెలియఁజేయుచున్నాఁడో, (ప్రకాశముగా) ఎవరక్కడ? కువలయావళిని దోడితెచ్చితి మని దేవికి విన్నవింపుఁడు.

దేవీ—(ఉపసృత్య సహర్షమ్) జేఉ జేఉ అయ్యఉత్తో। (జయతు జయత్వార్యపుత్రః)

నాయకః—(సాదరమ్) మహాదేవి! త్వదాదేశాదియం మయా ప్రత్యాహృతా దారికా!

రుక్మిణీ—లజ్జమానాం కువలయావళీమాలింగ్య) భఇణిఏ! తుఏ దుఈఅ అక్ఖదసరీరాఏ లోఅవాదాదో విముక్కహ్మి। (భగినికే! త్వయా ద్వితీయా అక్షతశరీరయా లోకవాదాద్ విముక్తాస్మి)

నాయకః— కథమత్రైవ భగవాన్ నారదః। భగవన్! అభివాదయే!

నారదః—(సహర్షాతిరేకమ్)

స్వస్తి శ్రీవాసుదేవాయ
 స్వస్తి దానవ ఘాతినే।
స్వస్తి మంగలమూలాయ
 స్వస్తి కారుణ్యశాలినే ॥ ౫౯.

శ్రీవత్సః—వడ్ఢది పిఅవఅస్సో దేవీఏ చిత్తసమారాహణేణ। (వర్ధతే ప్రియవయస్యో దేవ్యాశ్చిత్త సమారాధనేన)

నాయకః—(సస్మితమ్) కథం ప్రియవయస్యః?

రుక్మిణీ—భఇణిఏ! వందేహి భఅవంతం । (భగినికే! వన్దస్వ భగవన్తమ్)

కువలయావళీ—(విలోక్య) హంత! సో ఏసో భఅవం తాద ణారదో। (హన్త! స ఏష భగవాన్ తాత నారదః!) [ప్రణమ్యాశ్రు విముంచతి.]

దేవి—(సమీపించి, సంతోషముతో) ఆర్యపుత్రునకు జయము; జయము.

నాయకుఁడు—(ఆదరముతో) నీ యాదేశము ననుసరించి యీ బాలికను దెచ్చితిని.

రుక్మిణి—(సిగ్గుపడుచున్న కువలయావళిని గౌఁగిలించుకొని) చెల్లెలా! అక్షతశరీరవగు నీవు నన్ను లోకాపవాదమునుండి తప్పించితివి.

నాయకుఁడు—ఇదియేమి? నారదభగవానులు సైతము నిక్కడనేయున్నారే! మహాత్మా! అభివాదములు.

నారదుఁడు:—

స్వస్తియగుఁగాక వాసుదేవప్రభునకు!
స్వస్తియగుఁగాక దానవసంహారునకు!
స్వస్తియగుఁగాక మంగళస్థానమునకు!
స్వస్తియగుఁగాక కారుణ్యసాగరునకు! 19.

శ్రీవత్సుఁడు—దేవీచిత్తసమారాధనముచేఁ బ్రియవయస్యుఁడు వర్ధిల్లుచున్నవాఁడు.

నాయకుఁడు—(చిఱునవ్వుతో) ఓహో! ప్రియవయస్యుఁడా?

రుక్మిణి—చెల్లెలా! భగవానునకు నమస్కరింపుము.

కువలయావళి—(చూచి) ఓహో! వీరే నారదభగవానులు! (నమస్కరించి కన్నీరు విడుచును)

నారదః—పుత్రి! జగత్కంటకోద్ధరణహేతుతయా లోకోపకారిణీం త్వాం విలోక్య కృతార్థోఽస్మి।

[ప్రవిశ్య]

సుగంధికా—దేవీ! సఅలో వి భట్టిణీజణో విణ్ణవేది—అజ్జాఏ కజ్జసమాలోఅణేణ సంతేసిద మ్హి। జహ మహాదేవీఏ రోఅది తహ కరీఅదు త్తి। (దేవి! సకలోఽపి భట్టినీజనో విజ్ఞాపయతి—ఆర్యాయాః కార్యసమాలోచనేన సంతోషితోఽస్మి! యథా మహాదేవ్యై రోచతే తథా క్రియతా మితి)

రుక్మిణీ—(జనాంతికమ్) భఅవం! సమప్పేమి కువళఆవళిం అయ్య ఉత్తస్స। (భగవన్! సమర్పయామి కువలయావళీ మార్యపుత్రస్య)

నారదః—త్వమస్యాః ప్రభవసీతి పురైవ నివేదితమస్మాభిః!

రుక్మిణీ—అజ్జఉత్త! జఇ అహం తుజ్ఝ మాణణిజ్జా తా ఇఅం తుఏ అహ్మాణివ్విసేసం దట్ఠవ్వా! (ఆర్యపుత్ర! యద్యహం తవ మాననీయా తర్హీయం త్వయాస్మన్నిర్విశేషం ద్రష్టవ్యా) (ఇతినాయికాహస్తం నాయకస్య హస్తే సమర్పయతి।)

నాయకః—

హంత సమమేవ నిహితే
కువలయసుదృశా కరాంబుజే ప్రియయోః।
ఘనసారగంధసారౌ
మిళితావివ తాపమపనయతః॥ ౨౦.

నారదుఁడు—పుత్రీ! జగత్కంటకోద్ధరణహేతు వగుటను లోకోపకారిణి వైన నిన్నుజూచి కృతార్థుఁడనయితిని.

[ప్రవేశించి]

సుగంధిక—దేవీ! భట్టినీజనులందఱు నిట్లు విన్నవించుకొను చున్నారు:—"పూజ్యురాలగు రుక్మిణిగావించిన కార్యసమాలోచనము మాకును సంతోషముకలిగించుచున్నది. మహాదేవి యిచ్చవచ్చినట్లు చేయవచ్చును." అని.

రుక్మిణి—(జనాంతికముగా) పూజ్యుఁడా! కువలయావళి నార్యపుత్రునకు సమర్పింతునా?

నారదుఁడు—ఆమెపై నీ కధికారము కల దని మేము ముందుగానే చెప్పితిమిగదా?

రుక్మిణి—ఆర్యపుత్రా! నేను నీకు మాననీయనే యయితినేని నీ వీమె నస్మన్నిర్విశేషముగఁ జూతువుగాక! (అని నాయికాహస్తమును నాయకహస్తమందుంచును.)

(చూ. అను. పాట 15)

నాయకుఁడు:—

ఒకమొగి వనజాక్షి యుగళంబుగా నుంచు
జంటప్రియులకేలు జంట కలిసి
కలితగంధసారకర్పూరముల వోలె
నస్మదీయతాప మపనయించు. 20.

నారదః— (స బహుమానమ్) దేవ! నిఖలశ్రేయోనిదాన మవిచారేణ కరణీయో దేవ్యా నిదేశః!

నాయకః—యదాదిశతి భగవాన్। (ఇతి కువలయావల్యాః కరం గృహ్ణాతి।)

[సర్వే హర్షం నాటయన్తి।]

శ్రీవత్సః—సుళగ్గం హోదు। (సులగ్నం భవతు)

నారదః—తదేతదేకమేవ త్వయా నిర్వ్యాఢం యదుపదిష్ట మస్మాభిః।

వ్రతాని వర్ణనీయాని
సంత్వన్యాని సహస్రశః।
పరంవ్రతం పురంధ్రీణాం
పతిచిత్తానురంజనమ్ ॥ —౨౧.

ఇతి।

[ఆకాశే దుందుభిధ్వనిః।]

నారదః—దేవ! భవతః కువలయావలీకల్యాణమభినందతాం దేవానామయమానందవిలాసః।

నాయకః—(సప్రశ్రయం నారదం ప్రణమ్య) భగవన్! త్వత్ప్రసాదేన దేవీప్రసాదేన చ కతి కతి వా శ్రేయాంసి న మామనుబధ్నంతి? (సహర్షోత్కర్షమ్)।

రమ్యా వాగివ సుప్రసాదమధురా దేవీమణీ రుక్మిణీ
సన్నార్థ ఇవాత్యుదారగరిమా స త్వం పరిద్యోతసే।

నారదుఁడు — (గౌరవముతో) దేవా! దేవీనిదేశము నిఖిల శ్రేయోనిదానము; మఱియే యాలోచనము లేకయే యాచరింపఁదగినది.

నాయకుఁడు—భగవానుఁ డాదేశించినట్లే (అని కువలయావళి హస్తమును బట్టుకొనును)

[అందఱును సంతోషము నటింతురు]

శ్రీవత్సుఁడు—శుభలగ్నమగుఁగాక!

నారదుఁడు—మేముపదేశించినది నీ వాక్కుతవే నిర్వహించితివి.

వర్ణనీయంబులైన సువ్రతము లవని
వేలకొలఁదిగ నితరముల్ వెలయుఁగాక!
పతిమనోఽనురంజనమను వ్రతమొకండె
సతులకుత్తమంబగుచు సన్నుతివహించు. 21.

[ఆకాశమున దుందుభిధ్వని]

నారదుఁడు—దేవా! నీకును కువలయావళికిని జరుగు కళ్యాణము నభినందించు దేవతల యానందవిలాస మిది.

నాయకుఁడు — (వినయముతో నారదుని నమస్కరించి) పూజ్యుఁడా! నీ యనుగ్రహమునను, దేవీ యనుగ్రహమునను నా కెన్నియో శుభములు చేకూరును; గాకేమి?

దేవి రుక్మిణి రమ్యవాగ్దేవి వోలె
సుప్రసన్న మధురయునై శోభఁదనరు;
అత్యుదార గరిమమైన యర్థమట్లు
నీవు భాసిల్లుచుండుము నిరతముగను;

కన్యేయం కరవల్లరీవ విలసత్యన్యోన్యమైత్రీక్రమా
యుష్మాకం భువి మాదృశాన్ సహృదయానానందయ-
న్నేధతామ్ ॥ ౨౨.

నారదః—కిం తే భూయః ప్రియం కరోమి ।

నాయకః—

గాఢం మానమపాస్య మే హితకరః సర్వోఽపి దేవీ గణః
కన్యారత్నమిదం మనోహరగుణే దేవీపదే స్థాపితమ్ ।
కర్తవ్యేషు హితాహితేషు భగవాన్ ప్రీత్యా ప్రశాస్త్యన్వహం
తత్ పూర్ణాని మమేప్సితాని హి భవద్ భూతేభవిష్యంతి చ ॥

తథాచేదయమస్తు భరతవాక్యమ్—

కల్యాణమస్తు జగతాం సతతం త్రయాణాం
సంవర్ధితో భవతు వైదిక ఏవ మార్గః ।
సారస్వతాని సరసాని కవీశ్వరాణాం
మాత్సర్యదిగ్ధహృదయా న కలంకయన్తు॥ ౨౮.

[ఇతి నిష్క్రాంతాః సర్వే ।]

చతుర్థోఽంకః ।

పూర్ణేయం సింగభూపేన
గ్రథితా మధుజల్పితైః ।
రత్నపాంచాలికా నామ
నాటికా రసపేటికా ॥

శుభం భూయాత్ ॥

కరకుసుమమంజరివలె నీ కన్య యలరు;
మీకుఁ దనరెడు నన్యోన్య మిత్రతా క్ర
మంబు మాదృశ సహృదయ మానసముల
నెపుడు రంజిల్లఁజేయుచు నెసఁగుఁగాత! 22.

నారదుఁడు—(సంతోషాతిశయములతో) నీ కింతకంటె నెక్కుడు
ప్రియమైన దేమి యొనర్తును?

నాయకుఁడు:—

ఘనమా మానమువీడి నాకు హితమున్ గావించె దేవీగణం;
బనఁగా దేవిపదంబునన్ నిలిచెఁ గన్యారత్న; మీవెప్డుమా
కనుశాసింతు హితాహితంబులగు సర్వార్థంబులన్ బ్రీతితో;
ననఘా! నాకొనఁగూడు నీప్సితములాహా! మూఁడుకాలంబు
[లన్. 23.

అంతేకాక, యిది భరతవాక్యమగుఁగాక!
నిత్యకళ్యాణ మెసఁగుతన్ త్రిభువనమున!
ఆగమపథంబె వర్ధితం బగునుగాక!
రసికకవిచంద్రసరససారస్వతముల
మాపకుందురు గావుత మచ్ఛరీంద్రు. 24.

[అని యందఱు నిష్క్రమింతురు]

చ తు ర్థా ం క ము

సింగభూవిభుఁడు సంస్కృతభాషయందు
గమ్మని పలుకుల గ్రథియించినట్టి
రత్నపాంచాలిక రసపేటిక యనఁ
బాలుపారునాటిక పూర్ణమై వెలసె.

సంపూర్ణము.

# అనుబంధము

## పాటలు

### 1 (పుట 11)

[రుక్మిణీ, సత్యభామ మొదలయిన రాణులెనమండ్రును ఒక్కొక్క-రొక్కొక్క- చరణము పాడుదురు]

1. మహామోదకరమగు నాహా । యారామము ।
మహాత్ముఁడీ వసంతుఁడు। ప్రసాదించు గాదే యుపవనము॥
2. ఇంపైన పూలతో -
3. లతాళి సౌభాగ్యము । మహీరుహానందము
4. కుసుమాసవమును గొనుమధుపము
లొసగే। నాదమెంతో హాయి ।
5. కలకంఠుల కలనాదముతో
నలరు । శుకముల పలుకు లహా ।
6. వికసించిన పూవులవీచే
మలయానిల సౌరభమాహా ।
7. ప్రేమికు లోకచో - మనసిజవచో -
మహిమ గనుచో - టిదియె కదా ।
8. మనోజ్ఞమైన వనరమా
శుభస్థలీ - సీమ గనుమా
పాడుద మానందముతో ॥ మహామోద ॥

## 2 (పుట 19)

[రుక్మిణి, సత్యభామ మొదలయిన రాణులు ఒకొక్క చరణము ఇరువురు చొప్పున కలిసి పాడుదురు]

1. విభునకు విజయా నందము గూర్ప।
విజయోత్సవము । చేయ । పూనుదుమా ॥
2. జయజయభేరీ । ధ్వని గావించి ।
స్వాగత మనుచు । పల్కుదమా ॥ విభునకు ॥
3. మంగళహారతి । పాటలుపాడి
మన ప్రాణేశుని । పూజించెదమా ॥ విభునకు ॥
4. పురజనులెల్లా । మోదాన్వితులై
అలరుచు విలసిలులే । ఆనందము ॥ విభునకు ॥

## 3 (పుట 23)

[చంద్రలేఖయు కువలయావళియు ఒకొక్కరు ఒకొక్క చరణము పాడుదురు]

1. ఈ వనశోభ । కనుమా చెలియా ।
మన మలరించునుగా ॥
2. మాలతి లతికా । పరివృతమైన ।
మావులచందము । గనుమా ।
పూవుల యందము । గనుమా ।
కోవెల పాటలు । వినుమా ॥
3. ఆనందముతో । అళిబృంద మహా ।
అలరుల నలరును । గనుమా ॥
4. శారికరవము । స్వాగతమొసగు ।
కీరాలాపము । విందుగా ॥
5. ఈ వనశోభ । కమనీయమునై । మన మలరించునుగా॥

4. (పుట 33)

[చంద్రలేఖ నాయకుని సంబోధించి పాడెడు పాట]

విజయానందా। వికసితహృదయా।
యువతి జన। మోహనా॥
నిను గను నంత। పరిజన మంతా
మన మలరి। వెలయు గా॥
శుభచరితా। సుర వినుతా।
సుభగ రమా। మనోహరా॥
త్రిభువన మోహన। విలసిత నయనా।
శుభముల నొసగుమ। కృపగనుమా॥

5. (పుట 61)

[కువలయావళి తనలో పాడెడు పాట]

న్యాయ మగునా॥
నవీనతంబును। నాచేతంబును।
అపహరించు టారా! నరవరా।
నీవె నిజము। నా యుంగరము।
దొంగ వగుచు। గై కొంటివి గా॥
నా మనోహరు డవు నీవె కా।
కరుణ నను గనవా॥

6. (పుట 91)

[కువలయావళి తనలో పాడెడు పాట]

హా! తగునా? మనసిజా!
జాలి లేక జ్వాలింతువా॥

నను దయ గనవా । అబలను గానా? ఓ. మదనా! ॥
శరగతి మరల్పవా । నా ప్రియుని జేరగా ।
పురుషులను గాతువా । వెలదులను వేతువా ।
న్యాయమా? ఇది నెనరా? । జాలియె విడిచెదవా ॥

## 7 (పుట 95)

[కువలయావళి తనలో పాడెడు పాట]

నను నేలా । నవనీత చోరా
నిను జేర । వలపింతు వేరా ॥
నను నేచే । విరహాగ్ని నేలా
కన లింప । గనిపింప వేరా ॥
సుకుమారా । మరుతాప మణప
ఇకనైన నను జేర వలదా ॥
దయలేదా । నను బ్రోవ గనుమా ।
ప్రియ చిత్తాబ్జ సారంగ మా ॥

## 8. (పుట 95)

[చంద్రలేఖ పాడెడు పాట]

నీ తను బాధ । యణగును గాదా ।
నిను నతడు చేరగా ॥
నిను వలపించే । నీ వగలాడు । నినువలచు నిజముగా ॥
నీ తనుతాపం । బతనికిలేదా? లేకేమీ చెలియా ।
తాపము తోడను । తాపము కలియ । శీతల మగు
గాదా ॥

9. (పుట 103)

[కువలయావళి నాయకుని సంబోధించి పాడెడు పాట]

కరుణింపుమా । కరుణాత్మా ।
వెఱపావహింప । బెదరి హృదయ మదరును ॥
నను వీడుమా । యిపుడూ ।
నిను జేరలేక । దేవా । నిను విడిచి నే జనలేక
విలపింతుఁగా ॥

10. (పుట 107)

[నాయకుడు కువలయావళిని సంబోధించి పాడెడు పాట]

తను వొక లతగా । తన రెడు తన్వీ
ఫలదవు । తలోదరీ ॥
పెదవియె చిగురై । తొగరై పూచెను లేమా ।
ఎద గలుగు రాగమై ॥
చనుగవ యింపౌ । అలరుల చెండ్లై
తనరును మనోజ్ఞమై ।
ప్రణయిని వగు నీ । తనులతఫలము
నీ కటాక్షమే కా ॥

11. (పుట 109)

[సత్యభామ నాయకుని సంబోధించి పాడెడు పాట]

శృంగార రసాలయా ॥
నవనఖరతవలిత హృదయా ।
ప్రణయినీ జనమనో । హారణ చతురరచనా ॥

కైతవమాయా । నటనాచార్యా ।
ఆదరాన్విత ప్రియవచనా ।
ప్రేమసార సరి । దభంగ । తరంగ । విహార । విలోల ।
వికసిత హృదయా ।
సంగీతలోల । సంగాతురశీల । శృంగార రసాలయా ॥

12 (పుట 113)

[సత్యభామ నాయకుని సంబోధించి పాడెడు పాట]

ఇదియేకద నీ । కోదవిన లీలా ।
ఎఱుగనా । చోరుడా ॥
పెదవుల తీపి । ఎదలో విషము ।
వలపుల గొలుపుచు । వనితల చెఱచు ॥
పలు తడవల నా । మన మలర ।
వలపుల గిలికీ । వగ చిలికీ ।
మనో హరుడవై । యువలకరిగీ ।
నవసతీ । ప్రియుడవై । యుందువా?
జారుడా! చోరుడా! ధూర్తుడా ॥

13 (పుట 127)

[రుక్మిణి తనలో పాడెడు పాట]

నేరము చేసినదాన । గానా
నారదు డీ కథ । విని యే మనునో ॥
పరిజన ఘాతిని । యను నీ నింద
ఏ విధి భరియింతు ।
దుర్యశమయిన । బ్రదుకింకేలా ॥

### 14 (పుట 145)

[నాయకుడు, కువలయావళి ఒకొక్క రొకొక్క చరణము చొప్పున పాడుదురు]

1. ధూర్తుడ వని నను । దూరుదువా ।
 మగువా । నిన్ను । గొలువా ॥
2. ననునీ విటులను । నలుగురిలోను
 గుణవిహీనగా । గోరుదువా ॥
3. గుణముల క్రోవా । కులుకుల ప్రోవా
 చులుకన కాగలవా ॥
4. పొగడుదువేలా । కైతవశీలా ।
 పురుషుల కోదవే । వగలా ।
 నగవుల దెలిపీ । వలపుల గొలిపీ ।
 నగవుల తోనను గెలిచెదవా ॥

### 15 (పుట 149)

[రుక్మిణి నాయకుని సంబోధించి పాడెడు పాట]

సదయహృదయ కోనుమా । ప్రియతమా ।
అష్టభార్య లతి సంతోషముతో
ఇష్టముగా నీ కిచ్చిన కాన్క-
కువలయావళియు కూరిమితోడ
నీ నవ గృహిణీ భాగ్యము నంద ॥



Printed by the Diocesan Press, Madras
(P. I. C. No. [illegible], M. MS. 5)—14-1-46—A8807.